# యక్షిణీ తంత్ర రహస్యము

(అనుభవ యక్షిణీ తంత్ర సాధనలు)

# ఉడ్డీశ తంత్రం

(రావణబ్రహ్మకు శివుడుపదేశించిన
షట్కర్మ తంత్రములు)

విద్యాప్రవీణ

బ్రహ్మశ్రీ మేడవరపు సంపత్ కుమార్

M.A.సంస్కృతం

ప్రచురణ కర్తలు

గొల్లపూడి వీరాస్వామి సన్

పబ్లిషర్స్ అండ్ బుక్ సెల్లర్స్

కోటగుమ్మం - రాజమండ్రి - 1

కాపీరైట్] 2005 వెల : 30□00



యక్షిణీ తంత్ర రహస్యము & ఉడ్డీశ తంత్రం

2005

By

బ్రహ్మశ్రీ మేడవరపు సంపత్ కుమార్

4-399-విశ్వామిత్ర బిల్డింగ్,

తారకరామనగర్, జగన్నాధపురం,

కాకినాడ - 2.

ఫోన్ : 2341878

మీ సందేహాలకు మరియు
సలహాలకు
రచయితనే
సంప్రదించగలరు.

ముఖచిత్రాలంకరణ

గోల్డెన్ గ్రాఫిక్స్

రాజమండ్రి-

ఫోన్ : 2464707.

గ్రంథ ముద్రణ

మహేశ్వరి ఆఫ్‌సెట్ ప్రింటర్స్

పేపరు మిల్లు రోడ్

రాజమండ్రి- 533 104

ఫోన్ : 2478594.

ముఖచిత్ర ముద్రణ

ఈశ్వర్ ఆఫ్‌సెట్ ప్రింటర్స్

రాజమండ్రి- 533 103

ఫోన్: 2461532.

శ్రీ గురుభ్యో నమః

## క్రియాయోగ గురు పరంపర

శ్రీయుతులు

1 – మహావతార్ బాబాజీ

2 – శ్యామాచరణ్ లాహిరీ మహాశయులు

3 – యుక్తేశ్వర గిరి మహరాజ్

4 – పరమహంస యోగానంద

5 – హరిహరానంద స్వామి

6 – బ్రహ్మానందగిరి స్వామి

7 – సంపత్ కుమార్ (సాధనావస్థ)

నా పూర్వజన్మ సుకృతము వల్లనే ఆధ్యాత్మిక మార్గంలో పయనించే బాటసారిని కాగలిగానని నా భావన. జీవితంలో కొన్ని తప్పటడుగులు తప్పవు. అయినా 'గురుకృప' చేత వాటిని సరిదిద్దుకొని, పురోగమనం సాగించడానికి నా గురుపరంపర ఆశీస్సులు లభిస్తాయని భావిస్తూ

ముముక్షువు

**మేడవరపు సంపత్ కుమార్**

కాకినాడ – 2



## ఓం నమశ్శివాయ

## తంత్రపరిచితి

తంత్ర సాధనలో జపమునకు ప్రముఖ స్థానమున్నది. సకల తంత్రములను సర్వజ్ఞుడైన సదాశివుడు, గురు–శిష్య రూపముగా ఉండి సమస్త జన శ్రేయస్సుకూ తానే ఉపదేశించాడు. భూమండలంపై "తంత్ర శాస్త్రం" మూడు ప్రముఖ భేదములుగా విస్తరించి యున్నది. ఇవి

| | | |
|---|---|---|
| 1 – రథక్రాంత భూమి | 64 | తంత్రములు |
| 2 – విష్ణుక్రాంత భూమి | 64 | తంత్రములు |
| 3 – అశ్వక్రాంత భూమి | 64 | తంత్రములు |
| | 192 | |

"అశ్వక్రాంతా రథక్రాంతా విష్ణుక్రాంతా వసుంధరా" అని లలితా సహస్రమునందు కూడా ఉల్లేఖించబడింది. నాస్తికులను – విషయలోలురను మరింత మోహింపచేయుటకు, కల్పభేదముచేత కొన్ని విఫల తంత్రములు కూడా శివుని చేతనే చెప్పబడినవి.

మానవులకు 6 ఇంద్రియములవల్ల ఏ విధముగా జ్ఞానము కలుగునో, ఆ విధముగానే 6 వేదాంగముల వల్ల వేదార్థ జ్ఞానము తెలియును.

మానవులకు 5 కర్మేంద్రియములెట్లున్నవో, మహాకాలునకు పంచామ్నాయములు, శివునిచే చెప్పబడినవి.

శివుని సద్యోజాత ముఖమునుంచి పూర్వామ్నాయము వామదేవ ముఖము నుంచి దక్షిణామ్నాయము – అఘోర ముఖమునుంచి

పశ్చిమామ్నాయము – తత్పురుషముఖమునుంచి ఉత్తరామ్నాయము ఈశానముఖము నుంచి ఊర్ధ్వామ్నాయము ఉద్భవించినవి.

1 – ఊర్ధ్వామ్నాయం – ఇది వైదిక మార్గం.

దీనికి వేదములు ప్రమాణము వీటి అంశములు ధర్మశాస్త్రములు అంగములు పురాణములు, దేవతలు గాయత్రి మొ॥వారు.

1. బీజం – తండ్రి
2. క్షేత్రం – తల్లి
3. ఉపనయనం – వేదాధ్యయనార్హత
4. ఆచారం – నిషిద్ధములు వర్జించి విధిని నిర్వర్తించాలి.

ఈ నాలుగు లక్షణములు గలవారికి, దేవతలు వశమై యుందురు. ఈ నాలుగు లేనివారికి 'కౌళమార్గం' అనగా వామాచారం శరణ్యం. ఇందు కూడా పంచమకారములు అనగా మత్స్య, మాంస, మదిరా, ముద్రా, మైధునములు వీనిని "చక్రపూజ" యందు మాత్రమే, పరిమిత ప్రమాణములో సేవించాలి.

భోగపరాయణులై పంచమకార సేవన చేయరాదు. అందరికీ అన్ని మార్గములు అనుసరణీయములు కావు. పైవాటిలో మొదటి మూడు లేనివారికి తంత్ర శాస్త్ర మొక్కటే దిక్కు. వీరికి తంత్రమార్గం సిద్ధిస్తుంది.

వైదిక మార్గము సువర్ణము వంటిది. దీని వలన ఎన్నటికీ దుర్గతి కలుగదు. తంత్రమార్గము. రజతము వంటిది. ఇవి ఆ జన్మయందే సిద్ధించును. వేద మంత్రములు జన్మాంతరమునందునూ ఫలితమిచ్చును.

| | | |
|---|---|---|
| హ్రీం | బీజం | బ్రాహ్మణము |
| శ్రీం | బీజం | క్షత్రియం |
| క్లీం | బీజం | వైశ్యం |
| ఐం | బీజం | శూద్రం |



ఈ నాలుగు బీజములు లేని మంత్రము 'పౌలస్త్య మంత్రం' అనబడును. ఇవి బ్రాహ్మణులు జపించరాదు.

ఛిన్నమస్తా – మాతంగి – బగళా – ఉగ్రతార – యోగినులు – యక్షిణులు – త్రిపురా – బటుక భైరవం శాకర మంత్రములను బ్రాహ్మణులు జపించరాదు.

బ్రాహ్మణులకు వామాచారము నరకప్రదము. తంత్రసంధ్యా వందనము వేరు. తాంత్రిక హోమము వేరు. అన్నీ వైదికాచారమునకు భిన్నముగా నుండును.

వీనిని గురువువద్దనుండి దీక్ష తీసుకొను సమయముననే తెలుసు కొనవలయును.

తంత్రములు సిద్ధించవలెనన్న తాంత్రిక, శివగాయత్రి మంత్రము 24 లక్షలు, శివపంచాక్షరి 5 లక్షలు పురశ్చరణ చేయాలి.

ఐహికమైన అభివృద్ధిని కోరువారు ఉపాంశు జపము చేయాలి. కేవలం కైవల్యం కోరువారు మానసిక జపము చేయాలి. ఇది గురుపరంపరగా తెలుసుకొని అనుభవంలో చెబుతున్న శాస్త్రవచనం.

పంచాక్షరి మంత్రం 1 నిమిషమునకు వందసార్లు జపమగును. 1 గంటకు 6 వేలగును. 84 గంటలు చేసినచో 5 లక్షల 4 వేలు జపమగును.

ఈ విధముగా ఒక సంవత్సరము సాధన చేసినచో వాక్ సిద్ధి కలుగును. సాధకుని మాటలు అందరూ శిరసావహింతురు. వశీకరణము – ఆకర్షణశక్తి లభించును. కొందరికి సంచిత పాపకర్మ అధికముగా నున్న సిద్ధి ఆలస్యమగును. నిరాశ చెందరాదు.

మంత్రజపము, పర్వతశిఖరములందు – సిద్ధక్షేత్రములలో – శక్తిపీఠములలో – నదీతీరములందు మర్రిచెట్టుక్రింద – జ్యోతిర్లింగ శివ క్షేత్రములలో, భగ్న శివాలయములలో – ఏకాంతములో – జలపాత సన్నిధిలో – చేసినచో శీఘ్రముగా మంత్రము ఫలించును.

వాగ్గేయకారుడైన త్యాగయ్యకు 96 కోట్ల 'రామ' నామ జపం చేత శ్రీరామదర్శనం లభించింది. అపుడే "బాలకనకమయచేల – సుజన పరికాల "అనే కీర్తన ఆశువుగా పాడారు.

విద్యారణ్యస్వామి 13 మహాపురశ్చరణలు చేసి జన్మజన్మల పాపాలు పోగొట్టుకొని అమ్మవారి దర్శనం పొందారు.

శివపంచాక్షరిని రోజూ క్రమం తప్పకుండా 4 గంగులు, జపం చేసినచో 4,200 రోజులలో, అనగా 11 సంవత్సరముల 6 నెలల 20రోజులలో, ఒక కోటి జపమగును.

కాలం ఎంతో విలువైనది. వృథా చేయకండి. మీ శక్తి సామర్థ్యముల ననుసరించి, సాధన ప్రారంభించినచో అదే అభివృద్ధి చెందుతుంది.

మంత్ర – తంత్రములు ఆత్మశ్రేయస్సుకు పరోపకారానికి – దుః ఖనివృత్తికి ఉపయోగించాలి.

దుష్కర్మలకు – పగ – ప్రతీకారములకు వినియోగించిన దాని ఫలితం కూడా కర్మరూపేణ సంక్రమిస్తుంది.

ఐహికశ్రేయస్సుకు, సత్కర్మ, జప సాధనలే రాజమార్గములు.

'యక్షిణీ తంత్ర రహస్యము' అను ఈ పుస్తకము సాధకులకు ఎంతో జ్ఞానము కలిగించును.

"యక్ష" అను పదము ముందుగా, "జైమినీయ బ్రాహ్మణం"లో ఉల్లేఖించబడింది.

3–203; 272



యక్షులు దేవజాతికి చెందినవారు. గణపతి యక్షుడేనని రామాయణంలో 3–11–94 నందు పేర్కొనబడినది.

యక్షులకు రాజు కుబేరుడు. ఇతడు భూలోకమునందు ముందుగా ఒక బ్రాహ్మణునిగా, జన్మించి అనేక జపాభిషేకములవలన, క్రమముగా అనేక ఉత్తమ జన్మలు పొంది యక్షునిగా జన్మించి శివాను గ్రహమువలన ధనాధిపతియై శివునికి స్నేహితునిగానుండు వరమును పొంది "శివసఖ" అను నామము పొందెను. మణిభద్ర – పూర్ణభద్రులనే యక్షులు సోదరులుగా, సాంఖ్యాయన గృహ్యసూత్రమునందు వివరించబడింది.

Yakshas (యక్షాస్) అను పరిశోధన గ్రంథము, ఇంగ్లీషులో శ్రీ ఆనంద.కె కుమారస్వామి రచించారు. ఇందు ఎన్నో విషయములు చెప్పబడ్డాయి.

సంస్కృత, బెంగాలీ, భాషల్లో వకార–బకారములకు ఉకార–రేఫ కారములకు భేదము లేదు. అందుచేతనే రవీంద్ర అనునది, రబీంద్ర అని, వృందను – బృంద అని పలుకుతారు.

అదే విధముగా యకార – జకారములకు ఉత్తర భారతదేశ మునందు అభేదము కలదు.

యమున – జమున

యక్ష – జక్క

యక్ష – యక్షిణులు సౌందర్యమునకు, గంధర్వులు గానమునకు ప్రసిద్ధులు.

శివుని అనుగ్రహము వలననే యక్షిణీ విద్య సిద్ధి లభించును. అందరూ శివానుగ్రహమునకు పాత్రులు కావలెనని నా ఆకాంక్ష.

యంత్రములు భూర్జపత్రముపై గోరోచనాది ద్రవ్యములతో వ్రాసిననూ, రాగిరేకులపై లిఖింప చేసినను, ముందుగా "భూతలిపి" సిద్ధించవలయును. ఇటువంటి వారికే యంత్ర సిద్ధి కలుగును. భూతలిపిని గూర్చి కొంచెం వివరిస్తాను.

## భూతలిపి - న్యాసములు

### యంత్ర లేఖనం సిద్ధించాలంటే

ఏదైనా మంత్రం సిద్ధించాలంటే పంచాంగములతో కూడిన పురశ్చరణ తప్పక జరగాలి.

పంచాంగములనగా 1.పటలం-ఇది మూలమంత్రమును న్యాసములను తెలియజేయును. 2 పద్ధతి - యంత్రపూజావిధానము తెలియజేయును. 3. వర్మ-ఇది కవచము 4. సహస్రనామము 5. స్తోత్రం. దేవతకు కవచం శరీరము - పటలం శిరస్సు - పద్ధతి హస్తములు - సహస్రనామం ముఖము - స్తోత్రం పాదములు అగుచున్నవి.

**శ్లో॥ పటలం పద్ధతీ వర్మ తథానామ సహస్రకం**
**స్తోత్రాణి చేతి "పంచాగం" దేవతోపాసనేస్మృతమ్ ॥**

అపుడే ఆ సిద్ధించిన మంత్రముతో వశ్యాది షట్కర్మలూ సాధించడం వీలవుతుంది. అలాగే యంత్రము లిఖించి స్థాపన- ధారణాదులవల్ల వశ్యాది కర్మలు సిద్ధించాలంటే "భూతలిపి" సిద్ధించాలి. భూతలిపి సిద్ధించినవారే యంత్ర లేఖనమునకు అర్హులు. భూతలిపి అంటే ఏమిటో చూద్దాం.

ఇది 42 అక్షరములతో కూడినది.

**అం ఇం ఉం ఋం ఏం ఐం ఓం ఔం హం యం రం వం లం ఙం కం ఖం ఘం గం ఞం చం ఛం ఝం జం ణం టం ఠం ఢం డం నం తం థం ధం దం మం పం ఫం భం బం శం షం సం ॥**



ఈ మంత్రమునకు దక్షిణామూర్తి ఋషి - గాయత్రీ ఛందః - వర్ణేశ్వరీ దేవతా హాదిపంచకములతో హృదయాది న్యాసము చేయాలి. లక్ష జపము చేసి, పదివేలు తిలలతో హోమం చేసిన, అక్షరములు సిద్ధించును. యంత్రలేఖనమునందు అర్హుడగును.

ఈ భూతలిపిగూర్చి మంత్రమహోదధి - శారదా తిలకమను గ్రంథములలో వ్రాయబడినది.

హృదయాది న్యాసములలో కూడా ఎంతో వైజ్ఞానిక దృష్టి ఉన్నది. మంత్రాధిష్ఠాన దేవతను ధ్యానించే ముందు - మూల మంత్రముతో గాని, బీజాక్షరములతో గాని, రెండు చేతుల వేళ్లయందు న్యాసము చేయడం జరుగుతుంది. న్యాసమనగా ఉంచుట అని అర్థము. దీనినే కరన్యాస మంటారు. అనంతరం ఆ చేతితో హృదయం - శిరస్సు - శిఖ - నేత్రత్రయము - శరీరము చుట్టూ పరివేషముగా న్యాసము చేయుటచే అంగన్యాసమంటారు. తరువాత లోకత్రయముచే దిగ్బంధము. లోకత్రయ మనగా భూః-భువః సువః అనునవి. వీటిచేత దిగ్బంధనము చేసినట్లు భావించినచో సాధకుడు తన చుట్టూ ఒక దివ్యవలయము నేర్పరచుకొని, శరీరమునందు ఇష్టదేవతాహ్వానము చేసుకొని, మంత్రపూతమైన కరముతో జపమాలను ధరించి మంత్ర జపము చేసినచో అది ఫలప్రదమగును. "నా రుద్రో రుద్రమర్చయేత్" అని శృతి. అనగా తాను రుద్రభావము పొందనిదే, రుద్రుని అర్చించరాదని అర్థము. అందుచేతనే రుద్ర అభిషేకమునకు, లఘున్యాసము కాని, మహాన్యాసము కాని చేస్తారు. మంత్రము శీఘ్రముగా ఫలించుటకు దశవిధ మంత్ర సంస్కారములు కూడా చెప్పబడ్డాయి. శ్రద్ధ - కృషి - ఏకాగ్రత కలిగినచో ఏ మంత్రమైనా సిద్ధిస్తుంది.

## యక్షకర్దమం

శివానుగ్రహం పొందటానికి, శివపంచాక్షరి – తాంత్రిక శివ గాయత్రి జపము చేసిన అనంతరం, యక్షిణీ సాధన చేయువారు యక్షిణి అనుగ్రహము త్వరగా కలుగుటకు, యక్షకర్దమం ధరించాలి యక్షకర్దమం యక్షులకు చాలా ప్రీతిపాత్రమైనది.

యక్ష కర్దమం అనగా

1. కర్పూరము 2. అగురు 3. చందనము 4. కస్తూరి 5. తక్కోలము 6. కుంకుమపువ్వు.

వీటినన్నిటిని సమభాగములుగా కలిపి శరీరముపై విభూతి ధరించు స్థానములలో ధరించి "జపము" చేయవలయును. మంత్ర సాధనలో వారి పూర్వ సుకృతానుసారముగా సిద్ధి లభించును. నిర్దిష్ట విధానములో ఆచరించిననూ ఫలితము కన్పించకపోయినచో గురువు ద్వారా మంత్రమునకు "దశవిధ" సంస్కారములు చేయవలయును.

సకల విద్యలకు మూలము శంకరుడు. 'ఈశానః సర్వవిద్యానాం' అని వేదమంత్రము. ఈశ్వరానుగ్రహమును ముందు సంపాదించ వలయును.

భూలోకమునందు బ్రాహ్మణునిగా జన్మించి, శివునికి అభిషేకములు – పంచాక్షరీ జపము, వలన క్రమేణా ఉత్తమ జన్మలు పొంది చివరకు యక్ష జాతిలో జన్మించి, యక్షులకే రాజైనాడు కుబేరుడు. శివానుగ్రహము వలన శివసఖుడైనాడు. ఈ కథ శివపురాణమునందు వివరముగా నున్నది.

సాధకులు, – నియమలోపము – ద్రవ్యలోపము – చేయరాదు. సాధన చేయుచునే యుండవలయును. నిరాశ చెందరాదు.

॥శివానుగ్రహమస్తు॥



## సాధకులకు సూచనలు

1. ఏకాంతంలో జపము చేయుట శ్రేయస్కరము. నిర్ణీత సంఖ్య జపము చేయునపుడు మధ్యలో ఆసనము నుండి లేవరాదు.
2. సాత్వికాహారము – సత్యసంభాషణ – మితభాషిత్వము సద్బుద్ధి కలిగియుండాలి.
3. శుచి – శుభ్రతలు పాటించాలి.
4. క్షుద్రమైన బుద్ధిని విడిచిపెట్టాలి. లోకహితమును – ఆత్మశ్రేయస్సును కోరుకోవాలి.
5. గురుభక్తి – సర్వానుగ్రహము కలిగి యుండాలి.
6. కఠోరమైన దీక్ష – పట్టుదల – ఏకాగ్రత – శ్రద్ధ – మనో నిగ్రహం కలిగి యుండాలి.
7. పరద్రవ్యం – పరాన్న భోజనం – పరగృహవాసం మొ॥నవి పనికిరావు.
8. దైవభక్తి – పాపభీతి – వినయం ఉండాలి.
9. అన్నీ తెలిసినా ఏమీ తెలియనివానివలె ఉండాలి. ఇతరుల దోషముల నెంచరాదు.
10. సదా సంతోషముగా నుండాలి.
11. ప్రాప్తించిన ధన–సుఖములతో సంతృప్తి చెందాలి.

# యక్షిణీతంత్ర రహస్యములు విషయసూచిక

## ఉడ్డీశ తంత్రం విషయసూచిక

## కూర్మ చక్రం




దీనిని, సాధకుడు తాను కూర్చుని జపం చేసే ఆసనంపై, ఎరుపు–పసుపు–తెలుపు రంగులతో లిఖింపచేసి, దానిపై దర్భాసనంగాని, జింక చర్మంగాని వేసి 'మంత్రజపం' చేసినచో మంత్రసిద్ధి శీఘ్రముగా కలుగును.



# యక్షిణీ తంత్ర రహస్యములు

(అనుభవ యక్షిణీ తంత్ర సాధనలు)

# యక్షిణీ తంత్ర రహస్యములు

## యక్షిణీ, ప్రభావముల వివరములు

యక్షిణీ దేవతలనగా పార్వతీమాత యొక్క అవతార విశేషములు. అని మునిపుంగవులచే తెలుపబడినది.

పరమశివుడే స్వయముగా పార్వతీదేవికి తెలిపిన విధానము

## రుద్రయామళతంత్రే

**శ్లో ॥ ప్రణమ్యశిర సాగౌరీ ప్రోవాచ శశిఖేఖరం,**

తా ॥ శశిశేఖరుడు అయిన పరమేశ్వరుని చూచి పార్వతీదేవి వినమ్రతతో నమస్కరించి తన మనసునందున్న ప్రశ్నను ఈ విధముగా అడిగినది "యే కల్పము వలన దారిద్ర్యము అనునది లేకుండా పోవునో అట్టి దానిని దయతో చెప్పవలసినది ".

**శ్లో ॥ శ్రుత్వాగౌరీవచః శంభుః స్మితచారుశుభాననః ।శృణుత్వం**
**దేవదేవేశి దారిద్ర్య స్య వినాశకం ॥పురావిశ్వసృజాప్రోక్తా**
**కుబేరా యమహాత్మనేవిద్యాదారిద్ర్య సంహర్త్రీ యక్షిణీ**
**పాపభంజనీ । వేధసాతుసమాఖ్యాతా యక్షిణీసర్వసిద్ధిదా॥**



నీలకంఠుడు పార్వతీదేవి ప్రశ్నను వినినంతనే మృదు మంద హాసముతో "దేవీ! పాపములన్నింటినీ నశింపచేసి దారిద్ర్యమును సంహ రించుతూ కోరికలన్నింటిని ప్రసాదించునది అయిన యక్షిణీ మంత్రము లను పూర్వ కాలమున కుబేరునకు స్వయముగా బ్రహ్మదేవుడు వివరించి నాడు".

**శ్లో ॥ తతోనిధివరాణాంతు నాయకోనిశ్చితం భవేత్ ।**
**నిర్ధనోవామహీపోవా విద్యాంతాం బ్రహ్మణోముఖాత్ ।**
**శ్రుత్వాకుబేరవక్త్రేణ సభవేత్పరమోధనీ ॥**

తా ॥ పరబ్రహ్మచే తెలుసుకున్న యక్షిణీ విద్యను భక్తిశ్రద్ధలతో సిద్ధింపచేసుకొని విధి నాయకుడుగా నియమింపబడినాడు. ఆ తరువాత కాలమునుండి తాను తెలుసుకున్న యక్షిణీ విద్యను అనేకమంది దారిద్ర్యమునందు దుఃఖితులైన వారికి, మరియు ధనవంతులకు సైతం ఆ విద్యను వారి కోరిక మేరకు తెలిపి వారిని మరింత ఐశ్వర్యవంతులుగా గావించినాడు.

**శ్లో ॥ తచ్ఛ్రుత్వా గిరిజాదేవీ పునఃప్రాహశివంప్రతి ।**
**కృపాతే విద్యతే కాంతతదాత్వం మాంప్రబోధయ ॥**
**శ్రుత్వాపునశ్చ పార్వత్యాఃవాక్యమేవం ప్రహస్యచ ।**
**శంభుః ప్రాహనజానాసి పార్వత్యామూర్తిరేవసా ॥**

"ఎల్లరుకును తెలిసిన యక్షిణీ విద్య నాకు తెలియకున్నది కదా. నా ఎడల దయయుంచి సవివరముగా నాకు వివరింపుము". అని పార్వతీదేవి కోరగా పరమేశ్వరుడు చిన్నగా నవ్వి, "ఓ దేవీ! యక్షిణీ అనగా నీ స్వరూపమే..అంతేగాని వేరే ఏ దేవతయును కాదు, నీవు ఆ సత్యమును తెలుసుకోలేక యున్నావు" అని జవాబు చెప్పినాడు.

శ్లో ॥ యాంశ్రుత్వాయాతిరండోపి భూపాలత్వంననంశయః
విద్యాధరత్వమాప్నోతి కింపునర్బహుభాషితైః ।
యాతిలక్షేశ్వ రత్వంచ త్వద్భక్తో దేవిసర్వదా ॥

తా ॥ "ఓ దేవీ! బలహీనుడు, అర్హత అనునది లేనివాడు కూడా ఈ యక్షిణీ విద్యను భక్తిప్రపత్తులతో, మనోనిశ్చలంలతో సవివరంగా తెలుసుకుని ఆ మంత్ర ప్రభావములచే ధీరోదాత్తుడుగా, విద్యావంతుడుగా, ఐశ్వర్యవ ంతుడిగా అగుచున్నాడో......ఈ సమస్త కోరికలన్నియు నీ రూపమును పొందిన యక్షిణీ దేవతను భజించి, పూజించుట వలననే" అని పార్వతీమాతకు యక్షిణీ స్వరూపమును సాక్షాత్తు ఆమె అవతారవిశేషములేనని మానవాళికెల్లరకును తెలియచెప్పెను.

# యక్షిణీ సాధనోపాయములు

## తులసీ యక్షిణీ మంత్రము

**దత్తాత్రేయ తంత్రే :**

**మంత్రము : ఓం క్లీం క్లీం నమః**

శ్లో ॥ తులసీమూల మారూఢో జపేదేకా గ్రమానసః ।
అకస్మాద్రాజ్యమాప్నోతి నాన్యథాశంకరోదితం ॥

తా ॥ తులసీ యక్షిణీ ప్రత్యక్షమగుటకు సాధకుడు స్నానమాచరించి నిశీధి సమయమున స్థిరచిత్తముతో, భక్తిప్రపత్తులతో ఏకాగ్రతతో తులసిచెట్టు ఎదురుగా కూర్చుండి విడవకుండా పై మంత్రమును ఐదువేల సార్లు జపించ వలెను.



# వృక్షాశ్రిత యక్షిణీ సాధన

వృక్షములను ఆశ్రయించి ఉన్న యక్షిణీ దేవతల సాక్షాత్కారము కొరకు సాధకుడు ఉపాసించుటకు సిద్ధపడునప్పటికి పూర్వము ఆ సాధకుడు ఆచరించవలసిన విధానమును ఈ విధముగా చెప్పబడినది.

**దత్తాత్రేయ తంత్రే :**

శ్లో ॥ శ్రుణుశుసిద్ధిం మహాయోగిన్ యక్షిణీతంత్రసాధనం ।
యస్యసాధన మాత్రేణ నృణాం సర్వమనోరధాః ॥
ఆషాఢపూర్ణిమాయాంచ కృత్వాక్షౌరాది కాక్రియాః ।
సితేజ్యయోరమౌఢ్యేతు సాధ యేద్యక్షిణీంనరః ॥
ప్రతిపద్దినమారభ్య శ్రావణేందుబలాన్వితే ।

అనగా సాధకుడు గురుశుక్రుల మూఢమి కాకుండా యుండు ఆషాఢశుద్ధ పూర్ణిమ రోజున క్షౌరాదికములను పూర్తిగావించుకోవాలి. అనంతరము వచ్చు ఆషాఢ బహుళ పాడ్యమి మొదలు శ్రావణశుక్ల పూర్ణిమ వరకు అనగా ఆ మాసము రోజులు ఎటువంటి అడ్డంకులను దరికి చేరనీకుండా జాగ్రత్త వహించి ప్రతినిత్యము పగటికాలమందు మారేడు చెట్టుక్రింద అదియును నిర్జనప్రదేశములో ఉన్న మారేడు చెట్టు క్రింద ఆసీనుడై పరమేశ్వరుని భక్తిప్రపత్తులతో పూజించవలయును. అనంతరము యక్షాది, పతియైన కుబేరుని కూడా భక్తి ప్రపత్తులతో పూజించి క్రింద మంత్రమును 108 పర్యాయములు జపించవలెను.

**"యక్షరాజ నమస్తుభ్యం శంకర ప్రియబాంధవ**
**ఏకాం మేవశగాం నిత్యం యక్షిణీం కురుతేనమః**

పై విధముగా చేయుచు తనకు ప్రీతికరమైన యక్షిణీ దేవతను పై కల్పములో చెప్పిన విధంగా ఏకాగ్రచిత్తముతో, నిర్మలమనస్సుతో యధావిధిగా ఆచరించిన ఆ దేవతా యక్షిణీ సులభరీతిగా సాక్షాత్కరించును.

## ఉదుంబర యక్షిణీ సాధన

**దత్తాత్రేయ తంత్రే :**

**మంత్రము : హ్రీం శ్రీం శ్రీం శారదా యైనమః ।**

**శ్లో ॥ ఔదుంబర సమారూఢో జపేదేకా గ్రమానసః ।**
**లభేత్పుస్తక సంసిద్ధిం సర్వవిద్యాశ్చ తుర్దశ ॥**

**తా ॥** ఈ యక్షిణీ సాధనకు సాధకుడు ఏకాగ్రచిత్తముతో, నిర్మల మనస్సుగలవాడై ఉండి అత్తిచెట్టు క్రింద కూర్చుని అర్ధరాత్రి సమయమున పై మంత్రమును ఐదువేల పర్యాయములు జపించవలెను. ఈ ప్రకార ముగా ప్రతినిత్యము ఆచరించుతూ నలభైదినములు చేయవలెను. ఈ విధముగా చేసిన యెడల ఉదుంబర యక్షిణీ ప్రత్యక్షమై వేద వేదాంగ న్యాయ మీమాంసాది చతుర్దశ విద్యలను ప్రసాదించును. ఈ యక్షిణీ దేవతకు తేనె, పాయసము నైవేద్యముగా నివేదించవలెను.

## ఆమ్రయక్షిణీ సాధన

**దత్తాత్రేయ తంత్రే :**

**ఓం హ్రాం హ్రీం హ్రూం పుత్రం కురు కురు స్వాహా**

**శ్లో ॥ చూతవృక్షసమారూడో జపేదేకా గ్రమానసః ।**
**ఆపుత్రో లభతేపుత్రం నాన్యధా శంకరోదితం ॥**

**తా ॥** ఈ ఆమ్ర యక్షిణీ దేవత సంతానమును ప్రసాదిస్తుంది. కావున సంతానం కోసం కోరే సాధకుడు యధావిధిగా అన్ని కార్యములు నిర్వర్తించి నిశీధి సమయమున మామిడి వృక్షము పైన కూర్చుని ఎటువంటి మానసిక ఒత్తిడు లకు లోనుకాకుండా మనోనిశ్చలతతో పై మంత్రమును లక్షపర్యాయములు జపించవలెను.



ఆ విధముగా నలుబది రోజులపాటు అంతరాయము లేకుండా ప్రతినిత్యము జపించిన ఆమ్రయక్షిణీ ప్రత్యక్షమై ఒక ఫలమును నొసగును. ఆ ఫలమును భార్య భర్త లిరువురును భుజించిన యెడల శీఘ్రమే సంతానప్రాప్తి కలుగును.

## కుశయక్షిణీ సాధన

**దత్తాత్రేయ తంత్రే :**

**మంత్రము : ఓం వామాయై నమః**

**ఫలితమ్ : సర్వకార్యణి సిద్ధ్యన్తి నాన్యధా శంకరోదితం ॥**

తా ॥ కార్యసిద్ధి చేకూర్చు కుశయక్షిణీ సాక్షాత్కారము కొరకు సాధకుడు దర్భమొదటను ఆసీనుడై ఏకాగ్రతా చిత్తముతో నిశీధి రాత్రియందు పై మంత్రమును వరుసగా ఐదువేల పర్యాయములు జపము చేయవలెను. జపమాచరించునపుడు ఎటువంటి అడ్డంకులు కలుగకుండా ఉండునట్లుగ తప్పక చేయవలెను. ఈ ప్రకారముగా నలుబది దినములు క్రమము తప్పకుండా సాధకుడు ఆచరించిన కుశయక్షిణి ప్రసన్నురాలై అతనికి సాక్షాత్కరించి కార్యసిద్ధి చేకూరేలా దీవించును. ఈ దేవత ఆశీస్సులవలన ఎంతటి క్లిష్టకార్యము అయినను సులభముగా సిద్ధించును.

## అపామార్గ యక్షిణీ సాధన

**దత్తాత్రేయ తంత్రే :**

**మంత్రము : ఓం హ్రీం భారత్యైనమః**

**శ్లో ॥ అపామార్గసమారూఢో జపేదేకాగ్రమానసః ।**
**వాంచాసిద్ధిర్భ వేత్సత్యం నాన్యధాశంకరోదితం ॥**

తా ॥ సాధకుడు యధావిధిగా అన్నికార్యములు నిర్వర్తించి ఉత్తరేణి మొదటను కూర్చుని మనోనిశ్చతతో, ఏకాగ్రతతో నిశీధి సమయమున పై మంత్రమును విడువకుండా ఐదువేల పర్యాయములు జపము చేయవలెను. ఈ ప్రకారముగా మూడు మాసములు ప్రతినిత్యము క్రమము తప్పక జపము చేయుటవలన అపామార్గ యక్షిణీ ప్రత్యక్షమై వాక్సిద్ధిని ప్రసాదించును.

## ధాత్రీయక్షిణీ సాధన

**దత్తాత్రేయ తంత్రే :**

**మంత్రము : ఓం ఐం క్లీం నమః**

**శ్లో ॥ ధాత్రీమూల సమారూఢో జపేదేకా గ్రమానసః**
**అశుభక్షయ కారిణ్యా యక్షిణ్యా మంత్రముత్తమం**

తా ॥ ఉసిరిక చెట్టుక్రింద ఆసీనుడై మనోధైర్యము నిశ్చలతను కలిగియుండి లక్షపర్యాయములు పై మంత్రమును జపము చేయవలెను. ఈ విధముగా 11 రోజుల పాటు ప్రతినిత్యము ఆచరించిన అశుభము లను తొలగించు ధాత్రీయక్షిణీ దేవి ప్రసన్నురాలై ఆ సాధకునికి ప్రత్యక్ష మగును. అంతట ఆ సాధకుడు దేవితో " నా యందు అశుభములు కలుగకుండా ఉండునట్లు దీవించి వరమివ్వవలసినది" అని కోరిన ఆ యక్షిణి వరమునొసంగును.

## అర్కయక్షిణీ సాధన

**దత్తాత్రేయ తంత్రే :**

**మంత్రము : ఓం ఐం మహాయక్షిణ్యై సర్వకార్యసాధనం కురుకురు స్వాహా ।**



**శ్లో ॥ అర్కమూలసమారూఢో జపేదేకాగ్రమానసః।**
**యక్షిణీవిజయానామ సర్వకార్యకరీ సదా ॥**

తా ॥ ఈ యక్షిణి సర్వకార్యముల యందు జయమును ప్రసాదించును. సాధకుడు ఈమె అనుగ్రహమును సంప్రాప్తించు కొనుటకు యధాతధంగా అన్నింటిని నిర్వర్తించి తెల్లజిల్లేడు మొదట ఏకాగ్రమనోనిశ్చలతలతో ఆసీనుడై అర్ధరాత్రి సమయమున ఐదువేల పర్యాయములు క్రమము తప్పక జపించవలెను. ఈ ప్రకారముగా నలుబది రోజులు అంతరాయము లేకుండా ప్రతిరోజు ఆచరించిన అర్కయక్షిణి ప్రత్యక్షమై సర్వకార్యముల యందు విజయము చేకూరవలెనని వరమునిచ్చును.

## శ్వేత గుంజా యక్షిణీ సాధన

**దత్తాత్రేయ తంత్రే :**

**మంత్రము : ఓం జగన్మాత్రేనమః**

**శ్లో ॥ శ్వేతగుంజాసమారూఢో జపేదేకా గ్రమానసః ।**
**సంతోషాఖ్యాయక్షిణీతుదదాతివాంఛితంఫలం॥**

తా ॥ మనోవాంఛలను తీర్చు వరములొసంగు ఈ శ్వేత గంజ యక్షిణీ సాక్షాత్కారము కొరకై సాధకుడు ఏకాగ్రచిత్తముతో రాత్రి యందు తెల్లగురువింద చెట్టు మొదటను ఆసీనుడై పై మంత్రమును ఐదువేల సార్లు జపించవలెను.

ఈ విధముగా ప్రతినిత్యము నలుబది రోజులపాటు క్రమము తప్పక, నియమములు తప్పక జపమును సల్పిన శ్వేతగుంజాయక్షిణీ సాక్షాత్కా రము జరిగి కోరిన వరములను పొందవచ్చును.

## నిర్గుండీ యక్షిణీ సాధన

దత్తాత్రేయ తంత్రే :

మంత్రము : ఓం సరస్వత్యై నమః

శ్లో ॥ నిర్గుండీమూలమారూఢో జపేదేకా గ్రమానసః ।
విద్యాప్రాప్తిర్భ వేన్నిత్యం నాన్యథాశంకరోదితం॥

తా ॥ విద్యలయందు ఆరితేరుటకు ఈ నిర్గుండీ యక్షిణీ దీవెన ఉండవలయును. సాధకుడు వావిలి చెట్టు క్రింద ఆసీనుడై ఏకాగ్ర చిత్తముతో, మనోనిబ్బరముతో అర్ధరాత్రి సమయమున ఐదువేల పర్యాయములు పై మంత్రమును జపము చేయవలెను. ఈ ప్రకారమున నలుబది రోజులపాటు క్రమము తప్పక బ్రహ్మచర్య వ్రతుడై ప్రతినిత్యము ఆచరించిన నిర్గుండీ యక్షిణీ సాక్షాత్కారము అయి సమస్త విద్యలను పొందవచ్చును.

## అంకోల యక్షిణీ సాధన

మంత్రము : ఓం ప్రౌం నమః

శ్లో ॥ అంకోలవృక్షమారూఢో జపేదేకాగ్రమానసః ।
రాజాధిరాజో భవతి నాన్యధాశంకరోదితం ॥

తా ॥ ఊడుగ చెట్టు మొదటను ఆసీనుడై సాధకుడు నిశీథ సమయమున విధిగా ఏకాగ్రమనస్సుతో పై మంత్రమును జపము చేయవలెను. ఈ ప్రకారముగా నలుబది రోజుల పాటు ప్రతి నిత్యము ఆచరించిన అంకోల యక్షిణి ప్రత్యక్షమై సాధకుని కోరికపై రాజ్యపదవులను ప్రసాదించును.



# వివిధయక్షిణీ సాధనలు

## క్షీరార్ణవ యక్షిణీ సాధన

మంత్రము : ఓం నమోజ్వాలా మాణిక్య భూషణాయై నమః

విధానము : నిజగృహేద్వారవేదికాయాంస్థిత్వారాత్రౌపంచదశ శతంజపేత్ । దశదినానంతరే ప్రసన్నా భవతి । క్షీరఘృతదధి కదలీఫలానిదదాతి.

వివరణ :

ఈ యక్షిణీ సాక్షాత్కారము కొరకు సాధకుడు తన స్వగృహము యొక్క సింహద్వారము వద్దనున్న అరుగుమీద పద్మాసనమున ఆసీనుడై అర్ధరాత్రికాలమును పై మంత్రమును పదిహేను వందలు సార్లు జపము చేయవలెను.

ఈ ప్రకారముగా పదకొండు రోజుల పాటు క్రమము తప్పక ప్రతినిత్యము జపము చేసిన క్షీరార్ణవ యక్షిణీ సాక్షాత్కరించి పాలు, నెయ్యి, పెరుగు, ఫలములు యెల్లప్పుడు వాని గృహమునందు ఉండునట్లుగా వరమునిచ్చును.

## భిక్షిణీ యక్షిణీ సాధన

మంత్రము 1 : ఓం ఐం మహానాధే భిక్షిణీహ్రాంహ్రీం స్వాహా॥

మంత్రము 2 : ఓం హ్రీం మహానందే భిక్షిణీ హ్రీంహూంస్వాహా॥

విధానము 3 : త్రి పదస్థోజపే న్మంత్రంలక్షసంఖ్యందశాంశతః ఘృతాక్త గుగ్గులైర్హోమో భిక్షిణీ చింతి తంసదా.

**వివరణ :**

సాధకుడు స్థిరమైన మనస్సుతో మనోధైర్యమును కలిగియుండి నిశీధసమయ మున మూడు మార్గములు కలియుచోట ఆసీనుడై పై మంత్రములలో ఏదేని ఒక మంత్రమును జపము చేయుచు, నెయ్యి, తేనె, పంచదారలతో కలిసిన గుగ్గిలముతో పదివేలు హోమమును చేయవలెను. హోమానంతరము భిక్షిణీ యక్షిణీ దేవిని పూజించవలెను.

ఈ ప్రకారముగా 11 రోజుల పాటు నిర్వర్తించిన భిక్షిణీ యక్షిణీ ప్రత్యక్షమై సాధకుడు కోరిన వరములను ప్రసాదించును.

## చంద్రామృత యక్షిణీ సాధన

**మంత్రము :** **ఓంగులుగులుచంద్రామృతమయిఅవజాలితం**
**హులు హులు చంద్రవీరే స్వాహా ॥**

**విధానము :** **గృహేవారణ్యేఏకాకీలక్షమేకంజపేన్మనుం**
**పుష్పధూపాదిభిఃపూజాంనిత్యంకుర్యాత్రృయత్నతః**
**పంచామృతైర్దశాం శేన హువేద్దేవీ ప్రసీదతి ।**
**నిష్కానాంసహస్రైస్తు ప్రత్యాహంతో షయేద్బుధ।**

**వివరణ :**

సాధకునికి అనువుగా ఉండిన గృహమునందుగాని, లేక అరణ్యమునందుగాని ఏకాంతముగా ఉండి మనోనిశ్చలత కలిగి ఆసీనుడై పై మంత్రమును లక్షపర్యాయములు జపించవలయును. జపానంతరము చంద్రామృత యక్షిణికి షోడశోపచార పూజలను నిర్వర్తించవలయును. ఈ విధముగా నలుబది రోజులపాటు నిర్వహించి అనంతరము పంచామృతములతో పదివేల పర్యాయములు హోమము చేయవలయును.



బ్రహ్మచర్య దీక్షను వహించి ఎటువంటి ఆటంకములు కలుగ కుండా జాగ్రత్తగా నిర్వహించిన చంద్రావృత యక్షిణీ సాక్షాత్కరించి ప్రతినిత్యము వేయి బంగారు నాణెములను పొందునట్లుగా వరమును ప్రసాదించును.

## భూతసులోచనా సాధన

**మంత్రము :ఓం భూతే సులోచనే స్వాహా।**

**(అర్చనా) విధానము :**

**శ్లో ॥** **లక్షముత్పలశాకోత్థహుత్వామంత్రమముంజపేత్।**
**లక్షైకాదశ మావర్త్య హుత్వామధ్యేనిశిగృహే।**
**అథవామాలతీ పుష్పైర్హుత్వా భానుసహస్రకం।**
**భానుభుక్తిభవేద్యావత్పూర్ణా వైసిద్ధ్యతేధ్రువం**
**సహస్రంతుజపేదంతేసహస్రాంణాతుభోజనం॥**

**వివరణ :**

స్వగృహమునందు లేదా అద్దె గృహము నందు ఏకాంతప్రదేశమున ఆసీనుడై ఏకాగ్రచిత్తముతో పై మంత్రము 11లక్షలు జపము గావించి, అనంతరము కలువపువ్వులతో లక్షపర్యాయములు హోమము చేయవలయును. రాత్రి పదకొండులక్షలు జపమును, జాజిపువ్వులతో పన్రెండువేల పర్యాయములు హోమము చేసి పూర్ణాహుతి చేయవలెను.

ఈ విధంగా ఎటువంటి అంతరాయము లేకుండా పదకొండు రోజులపాటు కార్యక్రమము నిర్వహించిన భూతసులోచన దేవి ప్రసన్నురాలై సాధకునికి సాక్షాత్కరించి వేయి మంది మనుషులకు పోషించుటకు సరిపడ ధనమును ప్రతినిత్యము సాధకునకు కలుగునట్టు వరమును ఇచ్చును.

## ఉచ్ఛిష్ట యక్షిణీ సాధన

**ప్రాకృతగ్రంథే :**

**మంత్రము :** **ఓం జగత్త్రయమాతృకే పద్మనిభే స్వాహా।**

**విధానము :** **అనేన మంత్రేణ సర్వావస్థాయాం పంచ వింశతి సహస్రంప్రతిదినంజపేత్ప్రసన్నాభవతి అన్న వస్త్రైః పరిపూర్ణం కరోతి.**

పై మంత్రము ఏ సమయమునందైనను ఏ విధముగా నున్నను నిర్వహించవచ్చును. సాధకుడు పై మంత్రమును ఏ రోజునందయినగాని ఇరువది అయిదువేల పర్యాయములు జపించవలయును. ఆ రోజు మొదలుకొని నెలరోజులపాటు ఇదే క్రమమును ఆచరించున్న ఉచ్ఛిష్ట యక్షిణీ సాక్షాత్కరించి ఎల్లప్పుడు ధనధాన్యములు పరిపూర్ణముగా ఉండునట్టు వరమునిచ్చును.

## స్వామీశ్వరీ సాధన

**మంత్రము : ఓం హ్రీం ఆగచ్ఛ స్వామీశ్వరీ స్వాహా।**

**విధానము :** **ఏకాన్తేతుశు చౌదేశే త్రిసంధ్యంత్రి సహస్రకం।**
**మాసమేకంజపేన్మంత్రంతతఃపూజాంసమారభేత్।**
**పుష్పధూపాది నైవేద్యైః ప్రదీపైర్ఘృ తపూరితైః ।**
**రాత్రావభ్యర్చయేత్స మ్యక్సుస్థిరఃసుమనాస్సుధీః ॥**
**అర్ధరాత్రేగతే దేవీ సమాగత్య ప్రయచ్ఛతి ।**
**రసం రసాయనం దివ్యవస్త్రాలంకారభూషణం॥**

**విధానము :** ఒక రహస్య ప్రదేశమును ఎంచుకొని ఆ ప్రదేశమును శుభ్రము చేసి ముగ్గులు పెట్టి సాధకుడు కూడా స్నానాది కార్యక్రమము



లన్నింటిని ముగించి ఆ రహస్యప్రదేశమునందు ప్రాతఃకాలమున, మధ్యాహ్నమున, సాయంకాలమున వెయ్యిచొప్పున పై మంత్రమును జపించవలయును. ఈ ప్రకారముగా నెలరోజులుపాటు క్రమము తప్పక చేయవలయును.

అనంతరము 31వ రోజున ప్రాతఃకాలమన జపమాచరించి నేతితో దీపము వెలిగించి, స్వామీశ్వరీ యక్షిణీ దేవిని ఆవాహనము చేసి గంధపుష్పాక్షతలతో పూజలు సలిపి, శక్త్యనుసారం నైవేద్యమును పెట్టి తిరిగి ఏకాగ్రతతో దీక్షగా జపము చేయుచున్న యెడల స్వామీశ్వరీ యక్షిణీదేవి, ప్రసన్నురాలై ఆ సాధకునకు సాక్షాత్కరించును. అతను కోరిక ప్రకారముగా వజ్రవైఢూర్యాది ఆభరణములను ఇచ్చి ఆ సాధకుని సంతోషపరచును.

## జనరంజనీ సాధన

**మంత్రము :** **ఓం క్లీం జనరంజని స్వాహా ॥**

**విధానము :** **కదంబాదౌజపేన్మంత్రంలక్షద్వయంచసాధకః ।**
**ఘృతాక్త గుగ్గులైర్హోమం దేవీ సర్వార్థ సిద్ధిదా ॥**

**విధానము :** ఈ దేవి సాక్షాత్కారం కొరకు సాధకుడు ఒక నిర్జన ప్రదేశము నందు కడిమి క్రింద కూర్చుని స్థిరచిత్తముతో, ధైర్యమువీడకుండా పై మంత్రమును రెండులక్షల సార్లు జపము చేయవలెను.

అనంతరము నెయ్యి, తేనె, పంచదారల కలిపిన గుగ్గిలముతో ఇరవై వేలు హోమము చేయవలయును. అనంతరము జనరంజనీ యక్షిణీదేవిని పూజించవలయును. ఈ ప్రకారముగా 11 రోజులు జపము లొనర్చిన జనరంజనీ యక్షిణీదేవి ప్రసన్నురాలై సాధకునికి సాక్షాత్కరించి కోరిన వరములు సమస్తములను ఇచ్చును.

## శంఖినీ సాధన

**మంత్రము 1 :** **ఓం శంఖధారిణి శంఖాభరణే ప్రాం ప్రీం క్లీం క్లీం శ్రీః స్వాహా ॥**

**మంత్రము 2 :** **ఓం ప్రీం శంఖధారిణి శంఖాభరణే ప్రాం ప్రీం క్లీం ఐం అం స్వాహా ॥**

**విధానము :** **మంత్రాయుతంజపేన్మంత్రంప్రాతఃసూర్యో దయేసతి**
**మాసమేకం జపేదేవం పూజాం కుర్యాద్ది నేదినే ॥**
**శుద్ధ సంతప్త పట్టేతు శుభ్రపుష్పై స్సపాయసైః ।**
**దశాంశం హోమయేదాజ్యైరింధనైః కరవీరకైః ।**
**దదాతిశంఖినీ తుష్టా నిత్యం రూప్యంచ పంచకం ॥**

**విధానము :** ఈ మంత్ర జపమును ప్రాతఃకాలమునందు ప్రారంభించ వలయును. ముందుగా ఒక నేలను పసుపుతో అలికి పైన తెల్లవస్త్రమును పరచి పై మంత్రముల యందు ఒక మంత్రమును ఆ వస్త్రముపై వ్రాసి ఆ మంత్రమును తెల్లని పూవు లతో పూజించి, నెయ్యి, తేనె, అరటిపండ్లును నివేదించ వలయును.అనంతరము ఆ మంత్రమును పదివేల సార్లు జపించవలయును.ఇదే ప్రకారముగా 30 రోజులపాటు ప్రతినిత్యము క్రమము తప్పక జపమాచరించలయును.

అనంతరము తెల్లగన్నేరు సమిధలచే అగ్నిని ప్రజ్వలింపచేసి అందు ఆజ్యముతో ముప్పదివేలు హోమము చేయవలయును. హోమానంతరము శంఖినీదేవిని పూజించి ధ్యానించి జపమాచరించుచున్న ఆ దేవి ప్రసన్నురాలై సాధకునికి సాక్షాత్కరించి కోరిన వరములను ఇచ్చును.



## లక్ష్మీయక్షిణీ సాధన

**మంత్రము 1 :** **ఓం శ్రీం ప్రీం క్లీం మహాలక్ష్మ్యై నమః ।**

**మంత్రము 2 :** **ఓం ఐం లక్ష్మీం వం శ్రీం కమల ధారిణి హంసః స్వాహా॥**

**మంత్రము 3 :** **ఓం ఐం లక్ష్మీం శ్రీం కమల ధారిణీం కలహంసీం స్వాహా॥**

**విధానము :** స్వగృహమునందు సాధకుడు ఏకాంతప్రదేశమునందు దీక్షగా ఆసీనుడై ఏకాగ్రతతో పై మంత్రముల యందు యేదేని ఒక మంత్రమును లక్షపర్యాయములు జపించవలయును. అనంతరము ఎర్రగన్నేరు పువ్వులతో పదివేలు హోమమును చేయవలయును. తరువాత లక్ష్మీయక్షిణీ దేవిని ప్రార్ధించి పూజలు సలిపి శక్త్యనుసారం నైవేద్యములను సమర్పించ వలయును.

ఈ ప్రకారముగా సాధకుడు ఆచరించుచున్న లక్ష్మీయక్షిణీ దేవి సంతసించి సాధకునకు సాక్షాత్కరించి దివ్యరసాయనమును వొసంగి ఏ విధముగా ఆ రసాయనమును ఉపయోగించవచ్చునో తెలుపును.

## మహేంద్ర సాధన

**మంత్రము :** **ఐం క్లీం ఐంద్రి మహేంద్రి కులుకులు చులు చులు హంసః స్వాహా ॥**

**విధానము :** **శక్రచాపోదయే లక్షం నిర్గుండీ తల మధ్యగ ః ।**
**జపేన్మంత్రంత తస్తుష్టా దేవీ పాతాళ సిద్దిదా**

**విధానము :** సూర్యోదయకాలమునందు ఏకాంతప్రదేశమునందున్న వావిలిచెట్టు మొదటున, ఇంద్రధనుస్సు ఉదయించు కాలమునందు వావిలి చెట్టు వద్ద జపమాచరించుచున్న మహేంద్రదేవి ప్రసన్నురాలై

సాధకునకు సాక్షాత్కరించి పాతాళలోకమునుండి ఒక సిద్ధిద్రవ్యము ప్రసాదించును. ఆ ద్రవ్యముచే సాధకుడు కోరిన కోర్కెలన్నియు సిద్ధించును.

## శతపత్రికా సాధన

**మంత్రము :** **ఓం ప్రాం శతపత్రికే ప్రాం హ్రీం శ్రీం స్వాహా॥**

**విధానము :** **శతపత్రవనాంతస్థో లక్షసంఖ్యం జపేన్మనుం ।**
**క్షీరాజ్యం హోమయేద్యస్తురససిద్ధించభూనిధిం॥**

**విధానము :** రాత్రి కాలమునందు సాధకుడు తామరపూవులతో నిండియున్న తటాకతీరమునందు ఏకాంతముగా కూర్చొని ధైర్యచిత్తముతో పై మంత్రమును లక్షపర్యాయములు జపించి పాలు, నెయ్యి కలిపిన ద్రవ్యముతో పదివేలు హోమమును చేయవలయును. అనంతరము కొలనునందలి తామరలు ఉన్న స్థలమున శతప్రతికా యక్షిణీ దేవి ప్రార్ధించవలయును.

ఈ ప్రకారముగా ప్రతినిత్యము చేయుచున్న దేవి ప్రసన్నురాలై సాధకునికి సాక్షాత్కరించి రససిద్ధి ఘటికలను ప్రసాదించును. వాటి ప్రభావముచే భూమి యందున్న నిధి నిక్షేపములను సులభముగా గ్రహించవచ్చును.

## చంద్రికా సాధన

**మంత్రము 1 :** **ఓం హ్రీం చంద్రికే హంసః స్వాహా ॥**

**మంత్రము 2 :** **ఓం హ్రీం చంద్రికే హంసః సః క్లీం స్వాహా॥**

**విధానము :** ఈ చంద్రికా దేవిని ప్రసన్నము చేసుకొనుట కొరకు సాధకుడు ఏకాంత ప్రదేశమును ఎంచుకొని ఆ స్థలమును శుభ్రపరచి



తానును స్నానమాచరించి శుద్ధపాడ్యమి రోజున చంద్రోదయమున మొదలుపెట్టి చంద్రుని వీక్షించుచు చంద్రాస్తమయం వరకు పై మంత్రములలో ఏదో ఒక మంత్రమును తొమ్మిది లక్షల పర్యాయములు జపించవలయును.

ఈ ప్రకారముగా శుద్ధపాడ్యమి మొదలుకొని పూర్ణిమ వరకు కొనసాగించిన చంద్రికయను యక్షిణి ప్రత్యక్షమై సాధకునికి అమృతమును ప్రసాదించును. అనంతరము ఆ సాధకుడు ఆ చంద్రిక యక్షిణికి నమస్కరించి త్రాగిన యెడల దీర్ఘాయుర్దాయము కలుగును.

## మేఖలా సాధన

**మంత్రము 1 :ఓం క్రాం మదనమేఖలాయై నమః**

**మంత్రము 2 :ఓం హ్రాం మదనమేఖలాయై నమః స్వాహా ॥**

**విధానము :**

**శ్లో ॥ చతుర్దశాహపర్యంతం మధుకాధః స్థలేశుభే ।**
**ప్రజ పేదయుతం నిత్యం సహస్రంహవనంచరేత్॥**
**మధూకపుష్పై ర్మధ్వక్తైస్త్తా ఘ్టైశ్చ హుతాశనే ।**
**సంతుష్టైవం కృతేదేవీ ప్రయచ్ఛత్యం జనంశుభం ॥**

**విధానము :** సాధకుడు ఈ మేఖలాయక్షిణి అనుగ్రహము కొరకు ఏకాంత ప్రదేశమునందున్న ఇప్పచెట్టు మొదటను కూర్చుని నిశీథ సమయమున పై మంత్రములలో ఏదో ఒక మంత్రమును పదివేలసార్లు జపమును చేసి అనంతరము ఇప్ప సమిధలతో అగ్నిని ప్రజ్వలింప చేసి పుష్పములతో కూడిన తేనెతో వెయ్యి పర్యాయములు హోమము చేయవలయును.

ఈ ప్రకారముగా ఏకాగ్రతతో 30 రోజులు ఆచరించి అనంతరము నుంచి ప్రతి దినము 'మేఖలా' యను యక్షిణి దేవిని పూజించి

శక్త్యనుసారం జపించు చున్న ఆ దేవి ప్రసన్నురాలై సాధకునకు ఒక దివ్యాంజనము ప్రసాదించును. ఆ అంజనమును సాధకుడు కన్నులకు పెట్టుకొనిన భూమియందున్న నిధి నిక్షేపములు జాడ తెలియును.

## ఘంటా సాధన

**మంత్రము : ఓం ఐం పురం క్షోభయ క్షోభయ భగవతి**
**గంభీర స్వరేక్షీం స్వాహా ॥**

**విధానము :**

**సఘంటాం వాదయన్మంత్రం జపేన్మంత్రాయుతద్వయం**
**తతఃక్షోభయతే లోకాన్ దర్శనాదేవ సాధకః ॥**

**విధానము :** నిర్జన ప్రదేశమునందు ఏకాంతముగా సాధకుడు కూర్చుని ఒక గంటను మ్రోగించుతూ పై మంత్రమును ఇరువది వేల సార్లు జపించవలెను. ఈ ప్రకారమున పదకొండు రోజులు జపముచేసి ఘంటాయను యక్షిణీ దేవిని ధ్యానించి అర్ఘ్యపాద్యములొనర్చి అనంతరము శక్త్యనుసారం జపము చేయుచున్న ఆ ఘంటా యక్షిణీ దేవి ప్రసన్నురాలై సాధకునకు దర్శనమిచ్చి వరమునిచ్చును.

ఆ దేవి వరముచే సాధకుడు లోకమును వీక్షించినంతనే లోకములను క్షోభింప చేయు సామర్ధ్యమును పొందును.

## వికలాసాధన

**మంత్రము 1 ఓం వికలే ఐం హ్రీం క్లైం స్వాహా ॥**

**మంత్రము 2 ఓం వికలే ఐం హ్రీం శ్రీం క్లీంస్వాహా॥**

**విధానము : నిజగృహే త్రిమాసమధ్యే లక్షంజపేత్ కరవీర**
**పుష్పై ర్దశాంశతో హోమః తేన సిద్ధింధనంచదదాతి॥**



**విధానము :** సాధకుడు తన గృహమునందు ప్రతిరోజు రాత్రిసమయమున ఏకాంతప్రదేశములో కూర్చుని పై మంత్రములలో ఏదో ఒక మంత్రము జపించవలయును. ప్రతినిత్యము క్రమముతప్పక జపము చేయుచు మూడుమాసములలో ఒక లక్షజపమును పూర్తిచేయవలయును. అనంతరము ఎర్రగన్నేరు పూవులతో పదివేలు హోమము చేయవలయును. హోమానంతరము 'వికలా' యను యక్షిణీ దేవిని ప్రార్థించి షోడశోపచారములు గావించి నైవేద్యమును వొసంగవలయును. ఆ తరువాత నుండి ప్రతిరోజు శక్త్యానుసారం ఎంతో కొంత జపమును ఆచరించుచున్న దేవి ప్రసన్నురాలై సాధకునికి సాక్షాత్కరించి అతను కోరిన విధముగా అష్టైశ్వర్యములను ప్రసాదించును.

## హంసీ సాధన

**మంత్రము : హంసీ హంస హంసే హ్రీం స్వాహా॥**

**విధానము : ప్రదేశే నిర్జనే స్థిత్వాలక్ష సంఖ్యంజపేచ్చుచిః ।**
**పద్మపత్ర ఘృతో పేతమంతేహోమందశాంశతః॥**
**ప్రయచ్ఛ హంసీత్యంజనం యే నవశ్యతి భూవిధిం ।**
**శుద్ధశ్చే త్తంచ గృహ్ణాతి నవిఘ్నైః పరిభూయతే॥**

**విధానము:** సాధకుడు ఏకాంతప్రదేశమును రహస్యముగా ఉంచి స్థిరచిత్తముతో కూర్చుని దీక్షగా భీతిలేకుండా పై మంత్రము ఒక లక్షపర్యాయములు జపించవలయును. అనంతరము తామరపువ్వులు, నెయ్యి, వీటితో పదివేలసార్లు హోమము చేయవలయును. ఈ కార్యక్రమము సమాప్తము అయిన తరువాత హంస యక్షిణిని పూజించి శక్త్యానుసారం నైవేద్యం సమర్పించవలయును. అనంతరము ప్రతినిత్యము దేవిని పూజించి శక్త్యనుసారం మంత్రమును జపించుచున్న యక్షిణి

ప్రసన్నురాలై సాధకునకు సాక్షాత్కరించి ఒక అంజనమును ప్రసాదించును. ఆ అంజన ప్రభావముచే సాధకుడు భూమియందున్న నిధినిక్షేపములను గుర్తించగలడు. అంజనము పవిత్రమైన ప్రదేశము నందుంచిన ఆ అంజన ప్రభావము తొలగకుండా ఉండును.

## మదనాసాధన

**మంత్రము 1 :**

**ఓం మదనే, మదనేదేవి, మామాలింగయ సంగందేహి శ్రీ స్వాహా ॥**

**మంత్రము 2 :**

**ఓం ఐంమదనే,మదనవిద్రావణేఅనంగసంగమందేహిదేహికీంక్రీంస్వాహా॥**

**విధానము :** **లక్షసంఖ్యం జపేన్మంత్రం రాజద్వారే శుచిస్స్నుతా**
**సక్షీరమాలతీ పుష్పైః కృతేహోమేదశాంశతః ।**
**మదనాయక్షిణీ సిద్ధాగుటి కాంతం ప్రయచ్ఛతి ।**
**తయాముఖ స్థయాఽదృశ్యఃస్యాచ్చిరంసులభంనరః॥**

**విధానము :** సాధకుడు శుభ్రముగా స్నానమాచరించి శుచియైన వస్త్రములను ధరించి స్వగృహమునందలి రాజద్వారము నందు కూర్చొని పై మంత్రమునందలి ఒక మంత్రమును ఒక లక్షపర్యాయములు జపించవలయును. అనంతరము పాలలో ముంచిన జాజిపూవులతో హోమము చేయవలయును. చివరగా 'మదన' యక్షిణీ దేవిని ప్రార్థించి నైవేద్యము లొసంగవలయును.

అనంతరము ప్రతినిత్యము ఆ దేవిని పూజించి జపమును శక్త్యనుసారం జపించుచున్న దేవి ప్రసన్నురాలై సాక్షాత్కరించును. సాధకునకు ఒక సిద్ధగుటికను ప్రసాదించును. ఆ సిద్ధగుటికను నోటిలో ఉంచుకొనిన సాధకుడు అదృశ్యుడగును. గుటికను నోటినుండి తీసిన యెడల దృశ్యుడగును.



## మానినీ సాధన

**మంత్రము :** **ఓం ఐం మానినీ హ్రీం ఏహ్యేహి సుందరీ**
**హసహసమిహ సంగమహః స్వాహా ॥**

**విధానము :** **చతుష్పధేస్థితో లక్షం సపాదం ప్రజపేద్మనుః ।**
**సరాగకుసుమైః రక్తైర్హోమయేద్ఘృత మిశ్రితైః ।**
**మానినీ జాయతే సిద్ధదివ్యం ఖడ్గం ప్రయచ్ఛతి।**
**తత్ప్రభావేనలోకేస్మి న్నఖండరాజ్యమాప్నుయాత్।**

**విధానము :** ఈ మానినీదేవి సాధన కొరకు సాధకుడు నాలుగుకూడలులు అనగా నాలుగురోడ్లు లేదా వీధులు కలియు స్థానము నందు ఏకాగ్రతతో ఏకాంతంగా నిశీధిసమయమున పై మంత్రమును ఒక లక్షసార్లుజపము చేయవలయును.

జపమాచరించిన అనంతరము రక్త కమలములతో ఘృతమును కలిపి ఇరవై అయిదు వేల పర్యాయములు హోమము చేయవలయును. హోమానంతరము హోమభస్మమును భద్రపరచుకొని ప్రతినిత్యము నుదుటన ధరించవలెను. హోమము చేసిన అనంతరము 'మానినీ' దేవిని పూజించి నైవేద్యమును పెట్టవలెను.

ఆ మరుసటి దినము నుంచి దేవిని ప్రతినిత్యము ప్రార్థించుచు శక్త్యనుసారం జపము, నుదుటున విభూది ధరించుచున్న దేవి ప్రసన్నురాలై సాధకునకు ప్రత్యక్షమై ఒక దివ్య ఖడ్గమును ప్రసాదించును. ఆ ఖడ్గ ప్రభావముచే లోకములను జయించి రాజ్యాధికారము చేపట్టవచ్చును. ఆ ఖడ్గమునకు నమస్కరించి చేపట్టిన ఏ కార్యమయినను త్వరితముగా సఫలీకృతమగును.

## సులోచన సాధన

**మంత్రము : ఓం క్లాంసులోచనాదేవి స్వాహా ॥**

**శ్లో ॥ నదీతీరేస్థితో మంత్రీలక్ష త్రయం జపేన్మనుం ।
ఘృతహోమేదశాంశేన హుతేదేవీ ప్రసీదతి ॥
దదాతిపాదు కాయుగ్మంయదారూఢోభువస్థలం।
మనః పవనవేగేన యాతిచాయాతి వేగవాన్**

**విధానము :** సాధకుడు ప్రశాంతచిత్తముతో ఏకాగ్ర మనస్కుడై ఒక నదీతీరము నందు ఏకాంతముగా ధ్యానముద్ర యందుండి, పై మంత్రమును మూడు లక్షల పర్యాయములు జపము చేయవలయును. ఆ రోజు మధ్యరాత్రి సమయ మున 'సులోచన' యక్షిణీదేవిని ప్రార్థించి నైవేద్యమును పెట్ట వలయును.

ఆ మరుసటి రోజునుండి క్రమము తప్పక దేవిని ధ్యానించుచు శక్త్యను సారం జపము చేయుచున్న దేవి ప్రసన్నురాలై పాదుకాయుగ్మము అనగా పావుకోళ్ళ జతను ప్రసాదించును. సాధకుడు వీటిని ధరించిన, గమ్యమును మనోవేగముతో సరిసమయిన వేగముతో ప్రయాణమును సలుపగలడు.

## శోభనా సాధన

**మంత్రము : ఓం అశోకపల్లవా కారకరతల శోభనేదేవి శ్రీం క్షః స్వాహా ॥**

**విధానము : రక్తమాల్యాంబరో మంత్రీ చతుర్దశ దినంజపేత్
తతస్సిద్ధిర్భవేద్దేవీ శోభనా భోగదాయినీ ॥**

విధానము : సాధకుడు ఈ మంత్రమును ఏకాంతప్రదేశములో జపము చేయవలెను. సాధకుడు రక్తగంధమును శరీరమునకు వ్రాసుకొని ఎర్రని



వస్త్రములు ధరించి ఆనందమనస్కుడై యుండి, ఏకాగ్రతతో రోజుకు ఎనిమిది గంటలు చొప్పున పధ్నాలుగు రోజులు పై మంత్రమును జపించ వలయును.

బ్రహ్మచర్యమును పాటించుతూ ఏకభుక్తం ఉండి నియమముగా జపించ వలయును. అనంతరము శోభనా దేవిని ధ్యానించి, శక్త్యనుసారం ప్రతి దినము జపించుచున్న శోభనా దేవి ఆనందించి సాధకునకు ప్రత్యక్షమై కోరిన కోర్కెలను తీర్చును.

## మహాయక్షిణీ సాధనోపాయము

**శ్రీదేవ్యువాచ : దేవి స్వామిని ప్రశ్నించుతుంది.**

**శ్లో ॥ దేవదేవ జగన్నాథ కృపయావదమే విభో
నమంత్రైర్వైదికైర్దైవైః హోమైర్యో విధీయతే
సర్వనిః శ్రేయసంయావత్ కలౌ వీర్యవివర్ధనమ్
యస్యచస్మరణాత్సిద్ధిస్తన్మే బ్రూహిమహేశ్వర ॥**

**ఈశ్వర ఉవాచ :**

**శ్లో ॥ శృణుదేవి ప్రవక్ష్యామి గోప్యం గోప్యతరం మహత్ ।
యక్షిణీనాం ప్రయోగంచ వక్ష్యే సాధక సిద్ధిదమ్ ।**

అర్థము ఏమనగా పార్వతీదేవి పరమేశ్వరునితో ఈ విధముగా పలుకుతోంది "ఓ నీలకంఠా! శరణాగత వత్సలా! మాయందు దయతో వేదశాస్త్రము లందలి మంత్రరహస్య సిద్ధివిధానములచే సాధించలేనివి, తంత్రశాస్త్ర మందలి యక్షిణీ దేవతల సాధన చేసినందువలన సాధకులకు లోకకల్యా ణము, వీర్యవృద్ధి కలుగునటువంటివి కలియుగమున దేవతలను స్మరించినంత మాత్రముననే సిద్ధించెడి సాధన సులభసాధనా విధానములను తెలుపకోరుచున్నాను" అని ప్రశ్నించినది.

ఆ మాత ప్రశ్నలకు సమాధానముగా పరమేశ్వరుడు చిరునవ్వుతో "ఓ దేవీ! అతిరహస్యములైనవి, ప్రభావితములు అయినవి సాధకుడు జపించి నంతటనే సిద్ధించునటువంటి యక్షిణీ సాధనోపాయములను నీకు చెప్పెదను..... ఆలకింపుము" అని చెప్పదొడంగెను.

## భోగయక్షిణీ ప్రయోగము

**మంత్రము : ఓం నమో అగచ్ఛ సురసుందరీ స్వాహా**

**విధానము :** సాధకుడు కాలకృత్యముల అనంతరము శుచివస్త్రధారుడై పై మంత్రమును అరువది వేలుసార్లు జపము చేయవలయును. పంచఖాద్యము లతో దశాంశము హవనమొనర్చి దశాంశము తర్పణమొనర్చవలయును.

ఈ మంత్రము ఆచరించు దినమున చప్పిడి ఆహారము, మౌన వ్రతమును ఆచరించవలయును. ఈ విధముగా సాధకుడు ధ్యానించిన దేవి అతనికి బంగారమును నిత్యం ప్రసాదించును.

**మంత్రము 2 : ఓం హ్రీం శ్రీం క్లీం నమః**

**విధానము :** సాధకుడు ఆరక్షరముల మంత్రమైన ఈ మంత్రము స్నానానంతరము శుచివస్త్ర ధారియై, ప్రశాంత మనస్సుతో యిరువదివేల సార్లు జపము చేయవలయును. అనంతరము పాలు పాయసముతో దశాంశము హవనమొనర్చవలయును.

మంత్రజపము ఆచరించుసమయమున, పాలు మరియు పాలాన్నము మాత్రము ఆహారముగా తీసుకొనవలయును. ఈ విధముగా



సాధనము చేసిన సాధకుని యెడల దేవి ప్రసన్నురాలై భోగముల నిచ్చుటయే కాక భూత ప్రేతపిశాచములను అతనికి వశము చేయును.

**మంత్రము 3 : హ్రాం హ్రీం హ్రూం హ్రైం హ్రౌం హ్రః ॥**

**విధానము :** పై మంత్రమును సాధకుడు నిర్మల మనస్సుతో, శుచియై ఏకాంత ప్రదేశమునందు ఒక లక్షాయిరువది అయిదువేల పర్యాయములు జపించవలయును. ఈ సాధనము వలన దేవి సాధకునికి భూలాభము, గో లాభము ప్రాప్తింపచేయును.

**మంత్రము 4 : నానాచరణ పద్మావతీ స్వాహా ।**

**విధానము :** 11 అక్షరముల సమూహమైన ఈ మంత్రమును సాధకుడు ఏకాంత ప్రదేశమున ఎటువంటి అడ్డంకులు కలుగకుండా ఏర్పాటు చేసుకొని పదిలక్షలు సార్లు జపించవలయును. దశాంశము నేతితో మరియు తెల్లగులాబి పువ్వులతో హవనమొనర్చవలయును. ఈ ప్రకారముగా నిర్వహించిన దేవి ప్రసన్నురాలై అష్టభోగములను సాధకునికి ఇచ్చును.

బంధవిమోచనమునకు ధ్యానించవలసిన

## యక్షిణీ దేవతా మంత్రములు

**మంత్రము : ఓం నమో హటేశకుమారీ స్వాహా ॥**

**విధానము :** సాధకుడు ఈ మంత్రమును ప్రతినిత్యము రెండువేల చొప్పున ఏడురోజులు మంత్రజపములను ఒనర్చవలయును. దశాంశము పాలు,నెయ్యిలతో హవనము చేయవలయును. ఈ విధముగా చేసి ఒక కన్యకు పంచభక్ష్యములతో భోజనము పెట్టవలయును. ఈ విధముగా ఆచరించిన దేవి ప్రసన్నురాలై బంధవిమోచనమును చేయును.

## సర్వాకర్షణ యక్షిణీ మంత్రము

**మంత్రము : ఓం నమో సర్వస్త్రీ సర్వపురుష వశ్యకారిణి శ్రీం హ్రీం స్వాహా**

**విధానము :** ఈ మంత్రమును సాధకుడు ఒంటరిగా ఉండి 72 వేల పర్యాయములు జపము చేసిన మంత్రసిద్ధి కలుగును. దశాంశమున కొబ్బరి కాయలతో హవనమొనర్చవలయును. ఈ ప్రకారముగా క్రమ పద్ధతితో చేసిన ఎవరి పేరునయితే జపము చేసినారో వారు వశ్యమగుదురు.

## అష్టమహాసిద్ధి యక్షిణీ సాధన

**మంత్రము : ఓం క్లీం పద్మావతీ స్వాహా ॥**

**విధానము :** సాధకుడు ఈ మంత్రము నిర్జనప్రదేశమునందు ధైర్యముతో ఉండి ఎట్టి అడ్డంకులకు, మనసు వశమవకుండునట్లు ఉండి పన్నెండు లక్షల పర్యాయములు జపించవలెను. దశాంశమున పంచఖాద్యములతో హవనమొనర్చవలయును. ఈ విధముగ చేసిన యక్షిణీ ప్రసన్నురాలై అష్టసిద్ధులు ప్రాప్తించునట్లు ఆశీర్వదించును.

## విద్యాయక్షిణీ సాధన

**మంత్రము : ఓం హ్రీం వేదమాతృభ్యః స్వాహా ॥**

**విధానము :** ఈమంత్రమును 20వేల పర్యాయములు జపము చేసిన దశాంశమును పంచఖాద్యములతో హవనమొనర్చిన సాధకునకు విద్యాప్రాప్తి కలుగును.

## అదృశ్యకరణ యక్షిణీ సాధన

**మంత్రము : ఓం నమో భగవతి కరవీరకే స్వాహా ।**



**విధానము :** ఈ యక్షిణిని ప్రసన్నము చేసుకొనుటకు సాధకుడు కృష్ణ పక్షములో అష్టమి రోజు మొదలుకొని అమావాస్య వరకు ప్రతిరోజున పై మంత్రమును మూడు వేల పర్యాయములు జపించి దశాంశమును వేప సమిధలతో హవన మొనర్చవలయును. భస్మమును నుదుటున ధరించిన ఆ సాధకుడు అదృశ్యు డగును.

## అప్సరసల సాధనక్రమములు

అసలు 'అప్సరస' అను మాటకు అర్థం ఏమిటనగా, 'అస్యన్తే ప్రాప్యన్తే పుణ్యకృద్భిరిత్యప్సరసః'.........అనగా ఎంతో పుణ్యము చేసుకొనిన మాత్రమే ఆ అప్సరసల సాక్షాత్కారము సాధకునకు కలుగును అని అర్థం.

ముఖ్యంగా అప్సరసలు ఎనమండుగురు. వారు

1) శశిదేవి
2) తిలోత్తమ
3) కాంచనమాల
4) కుండలహారిణి
5) రత్నమాల
6) రంభ
7) ఊర్వశి
8) శ్రీభూష.

వీరిని గూర్చి ఈ విధంగా చెప్పినారు.

**శ్లో ॥ విద్యాధరో అప్సనరోయక్షరక్షో గంధర్వ కిన్నరాః ।**
**పిశాచోగుహ్యా కస్సిద్ధో భూతో మీదేవయోనయః ॥**

అనగా దేవయోనులగుచు కేవలము దైవాంశము గల కామోపభోగలాలస విలాసినులుగా నున్నారు.

## శశీదేవి సాధన

**భూతడామర తంత్రే :**

**మంత్రము :** **ఓం శ్రీం శశిదేవ్యా గచ్ఛాగచ్ఛ స్వాహా।**

**విధానము :** **పర్వత శిఖరమారుహ్య లక్షం జపేత్**
**సిద్ధోభవతి । పౌర్ణమాస్యాం యధావిభవతః ।**
**పూజాంకృత్వా ।**
**ఘృతదీపం ప్రజ్వాల్య సకలరాత్రిం జపేత్।**
**ప్రభాతేనియత –**
**మాగచ్ఛతి । స్వయం దేవ్యై ఆగతాయై**
**చందనార్ఘ్యోదేయః వాచాభాషతే ।**
**సాధకేనైవం వక్తవ్యం మమభార్యాభవేతి ।**
**సిద్ధిద్రవ్యం రసరసాయనం దదాతి వర్షసహస్రం**
**జీవయతి॥**

అనగా ఈ దేవి సాధన కొరకు సాధకుడు పర్వత శిఖరములకు పోయి అచ్చట ఏకాంత ప్రదేశమునందు పై మంత్రమును ఒక లక్ష పర్యాయ ములు జపించవలయును. ఆ విధముగా చేయుట వలన మంత్రసిద్ధి కలుగును. అనంతరము వచ్చిన పౌర్ణమి రోజున యధావిధిగా శశీదేవిని పూజించి, ధ్యానించి ఆమెను స్తుతించి ఆ దేవికి నేతితో దీపమును వెలిగించి ఆ రోజు రాత్రియంతా దేవిని ధ్యానించి జపించ వలయును.

ఈ విధంగా చేసిన సాధకునకు ప్రాతఃకాలమునందు దేవి



సాక్షాత్కారము లభించును. అంతట ఆ శశీదేవిని సాధకుడు చందనాది అర్ఘపాద్యములను సమర్పించిన యెడల దేవి వానితో మాట్లాడును. అప్పుడు సాధకుడు “మమ భార్యా భవ” అని పలికిన ఆ దేవి ప్రసన్నురాలై ఆ సాధకునికి రసాయనమును ఇచ్చును. ఆ రసాయన ప్రభావముచే సాధకుడు వేయి సంవత్సరములు జీవించును.

## తిలోత్తమ సాధన

**భూతడామర తంత్రే :**

**మంత్రము :** **ఓం శ్రీం తిలోత్తమే ఆగచ్ఛా గచ్ఛ స్వాహా**

**విధానము :**

**క్షీరాహారేణాయుతం జపేత్,దివసాని**
**సప్తదివసేసప్తమే ఉపచారపూజాం కృత్వా శుక్లాష్టమ్యాం**
**పర్వతమూర్ధ్ని ఉత్థాయః సకలరా త్రికాలం ప్రజపేత్ ।**
**ప్రభాతే నియతమాగచ్ఛతి । ఈ షద్దసితరాగేణ పురతః తిష్ఠతి।**
**అలింగనం చుంబనంచ తయాసహ కర్తవ్యం**
**తూష్ణీంభావేన కామయేత్ ఏవం సిద్ధాభవతి ।**
**యమిచ్ఛతి కామంతం దదాతి**
**పృష్ఠ మారోప్య స్వర్గ మపి గమయతి రాజ్యం దదాతి ॥**

అనగా తిలోత్తమదేవి సాక్షాత్కారము కొరకు సాధకుడు పర్వతప్రాంతము నందు ఏకాంతముగానుండి రోజుకు 7వేల పర్యాయములు చొప్పున, 7 దినములు పైమంత్రమును జపించవలయును. ప్రతినిత్యము పాలను మాత్రమే సేవింపవలయును. ఏడవరోజున జపము అనంతరము సంపూర్ణ ముగా తిలోత్తమ దేవికి పూజలు సలిపి ఆమెను ధ్యానించవలయును. అనంత రము వచ్చెడు శుక్లపక్షమునందలి

అష్టమితిథి రోజు మొత్తము దేవీ జపమును చేసిన ప్రాతఃకాలమున తిలోత్తమ సాధకునికి ప్రత్యక్షమై కోరిన వరములను వొసంగును.

## కాంచనమాలా సాధన

**భూతడామర తంత్రే :**

**మంత్రము : ఓం శ్రీం కాంచనమాలే అగచ్ఛాగచ్ఛ స్వాహా।**

**విధానము : నదీ సంగమం గత్వా అష్ట సహస్రం జపేత్ ॥**
**దివసాని సప్తసప్తమేదివసే ఉదారపూజాం కృత్వా।**
**గుగ్గులు ధూపం దత్వా। సకలాంరాత్రిం జపేత్ ।**
**ప్రభాతేని యత మాగచ్ఛతి సాచ సర్వాశాంపూరయతి॥**

అనగా సాధకుడు ఈ కాంచనమాలా దేవి సాధన కొరకై నదీ సంగమ ప్రదేశమునకు వెడలి రోజునకు ఎనిమిది వేలు చొప్పున ఏడు రోజులు పై మంత్రము జపించవలయును. ఆఖరు రోజయిన ఏడవ దినమున దేవికి ధూపదీపనైవేద్యములను సమర్పించి ఆ రాత్రియంతయు మరల మంత్రమును జపించవలయును. ఈ ప్రకారముగా క్రమము తప్పక ఆచరించిన సాధకునకు దేవి ప్రసన్నురాలై సాక్షాత్కరించును. ఆమెను ప్రసన్నము చేసుకొని కోర్కెలను కోరిన ఆ సాధకుని ఆశయములన్నింటిని దేవి తీర్చివేయును.

## కుండలహారిణీ అప్సరస సాధన

**భూతడామర తంత్రే :**

**మంత్రము : ఓం హ్రీం శ్రీం కుండలహారిణి ఆగచ్ఛా గచ్ఛస్వాహా।**

**విధానం ॥ నతిథిర్నచ నక్షత్రంనోపవాసోవిధిర్నతు**
**పర్వతమూర్ధ్ని గత్వా అయుతం జపేన్మా సమితం।**



**తతో –ర్ధరాత్రే నియత మాగచ్ఛతి। అర్ఘ్యోదేయం।**
**భార్యాభవతి దివా**
**లక్షం ప్రతిదినం దదాతి। పృష్ఠ మారోప్య సర్వతో**
**భ్రామయతి రసరసాయనం సిద్ధద్రవ్యంచ దదాతి ॥**

**విధానము :** ఈ కుండలహారిణీ అప్సరసను సాక్షాత్కరింప చేసుకొనుటకు నియమ నిబంధనలు, సమయాసమయములు, తిథినక్షత్రములు వంటివి ఏవియు లేవు. సాధకుడు తనకు ఇష్టమైన రోజు మొదలుకొని ఒక పర్వతప్రాంతమునందు పై మంత్రమును పదివేల పర్యాయములు జపించ వలయును.

ఈ ప్రకారముగా నెలరోజులపాటు మంత్రజపము చేయవల యును. చివరిరోజున రాత్రిజాము కూడా ధూపదీపనైవేద్యములను కుండలహారిణీ అప్సరసకు సమర్పించి రాత్రి అంతయు మంత్రజపము గావించిన ప్రాతఃకాలమున సాధకునికి కుండలహారిణీ అప్సరస సాక్షాత్కరించును. ఆమెకు అర్ఘ్యములిచ్చిన ఆమె ప్రసన్నురాలై సాధకునికి రసరసాయనమును సిద్ధిద్రవ్యమును ఇచ్చును. ఈ ద్రవ్యప్రభావముచే సాధకుడు కోరిన ప్రాంతములకు చిటికెలో చేరుకొనగలడు. అంతేకాక రసాయన ప్రభావముచే సాధకుడు కోరిన కోర్కెలు అన్నియూ తీరిపోవును.

## రత్నమాలా అప్సరస సాధన

**భూతడామర తంత్రే :**

**మంత్రము : ఓం హూంరత్నమాలే అగచ్ఛా గచ్ఛస్వాహా।**

విధానం :

**దేవతాయతనం గత్వా అష్ఠ సహస్రం జపే న్మాసమేకం తతో మాసాన్తే పౌర్ణమాస్యాంపూజాంకృత్వా పునర్జపేత్ । తావజ్జ**

పేద్యావదర్ధరాత్రే మహానూపురశబ్దే నాగచ్ఛతి ఆగతాయై పుష్పా సనందద్యాత్ । స్వాగతం దేవ్యా ఇతి వక్తవ్యం స్వామిన్కిమాజ్ఞాపయసి ఇతిసావదతి-తదా సాధకేన వక్తవ్యం మమభార్యా భవేతి । భార్యా కర్మకరోత్యేవం భోజ్యం యచ్ఛతి కామికం । పాలిత వర్ష సహస్రాణి రత్నమాలా మనోరమా

అనగా సాధకుడు దేవాలయమునందు ప్రాతఃకాలమునందు మొదలుపెట్టి పై మంత్రమును ఎనిమిదివేల పర్యాయములు జపించ వలయును. ఈ ప్రకారమున నెలరోజుల పాటు సాధకుడు క్రమము తప్పక మంత్రము జపించవలయును. ఈ అనంతరము వచ్చు పౌర్ణమి తిధిరోజున రత్నమాలా అప్సరసను పూజించి ఆ రోజు అంతయు మంత్ర జపము చేయుచున్న అర్ధరాత్రిసమయమున గల్లుగల్లుమనెడి గజ్జెల సవ్వడితో రత్నమాలా అప్సరస సాక్షాత్కరించును.

అంతట ఆమెకు పుష్పాసనమును సమర్పించి సాధకుడు "స్వాగతం దేవ్యా" అని స్వాగతమీయవలెను. అప్పుడు ఆమె "స్వామిన్కిమాజ్ఞా పయసి' అని అడుగగా సాధకుడు ఆమెతో "మమ భార్యాభవ" అని పలుకవలయును. అంతే ఆమె వేయిసంవత్సరముల ఆయుష్షును కలిగించి అతని యందుండి సకలబాధ్యతలను నిర్వహించుచుండును.

## రంభా సాధన

**భూతడామర తంత్రే :**

**మంత్రము : ఓం సః రంభే ఆగచ్ఛా గచ్ఛ స్వాహా ॥**

**విధానం :**

ప్రతి పదమారభ్య పూజాంకృత్వాచందనేన మండలం కృత్వా। గుగ్గులు ధూపం దత్వా ఉ ష్టసహస్రం జపే త్రి సంధ్యం । తతః



పౌర్ణమాస్యాం మహతీం పూజాం కృత్వా । సకలాంరాత్రిం జపేత్ । ప్రభాతే శీఘ్రమాగచ్ఛతి ఆగత్య సాభార్యాభవతి యధేష్టం కామితవ్యా।దశవర్షసహస్రాణి జీవతి । సర్వాశాం పురయతి । మృతోరాజకులే జాయతే।

అనగా సాధకుడు రంభాసాక్షాత్కారము కొరకు మంత్రమును పాడ్యమి రోజున ప్రారంభింపవలయును. ఆ రోజున రంభాదేవికి పూజచేసి చందనమండపము చేసి గుగ్గిలముతో ధూపము యిచ్చి జపించవలయును. ఈ విధముగ పౌర్ణమి వరకు నిర్వహించి పౌర్ణమి తిధి రోజున యధావిధిగా సకలమర్యాదలు రంభా అప్సరసకు గావించి యధావిధిగా పూజగావించి రాత్రియంతయు కూడా పై మంత్రజపము చేయవలయును. అంతట రంభ ప్రాతఃకాలము నందు సాక్షాత్కరించును. సాధకుడు ఆమెకు ఆర్ఘ్యపాద్యముల నొనర్చి "మమ భార్యాభవ" అని పలికిన ఆమె వాని యందే ఉండి దీర్ఘాయువును, సకలసంపదలను ఇచ్చి చిరకాలము వానిని సుఖింపచేయును. అతడు మరణించిన తరువాత - ఉత్తమ రాజవంశమున జన్మించును.

## ఊర్వశీ, అప్సరస సాధన

**భూత డామరతంత్రే :**

**మంత్రము : ఓం శ్రీం ఊర్వశి ఆగచ్ఛా గచ్ఛ స్వాహా ।**

**విధానం :**

ప్రతి పదమారభ్య పూజాం కృత్వా । చందనేనమండలం కృత్వా గుగ్గులు ధూపం దత్వా । అష్టసహస్రం జపేత్త్రి సంధ్యం। తతః పౌర్ణమాస్యాం మహతీంపూజాంకృత్వా।సకలాంరాత్రిం జపేత్। ప్రభాతే శీ ఘ్రమాగచ్ఛతి కుసుమాసనందద్యాత్ స్వాగతమితి వక్తవ్యం।

**భో భో సాధకకిమాజ్ఞాపయసి, తదా సాధకేన వక్తవ్యం, మమభార్యా భవేతి,రసరసాయనసిద్ధి దవ్యాణి దదాతి, పర స్త్రియాభిగమనంన కర్తవ్యం పంచవర్ష సహస్రాణి జీవతి ॥**

ఈ అప్సరస సాధన కొరకు కూడా సాధకుడు పాడ్యమి రోజునుండి మొదలు కొని పూర్ణిమవరకు జపము చేయవలెను. పాడ్యమిరోజున ఊర్వశిని పూజించి చందనమండపమును నిర్మించి గుగ్గిలముతో ధూపము వేసి ఆ ప్రాంతముననే కూర్చుండి పై మంత్రమును మూడుసంధ్యలయందు ఎనిమిదివేల పర్యాయములు జపించవలయును. ఈ ప్రకారముగా ప్రతి నిత్యము పౌర్ణమి వచ్చువరకు విధానము నిర్వహించవలయును. పౌర్ణమి రోజున యధావిధిగా మహాపూజను నిర్వహించి మంత్రజపమును ఆ రాత్రి అంతయు కూడా సల్పవలెను. అంతట ఊర్వశీ ప్రాతఃకాలమునందు ప్రత్యక్షమవును.

అంతట ఆమెను పుష్పములతో, చందనములతో పూజించి ఆర్ఘ్య పాద్యములను సమర్పించి ఆమెకు స్వాగతమునీయవలయును. ఆ స్వాగతమునకు ఆమె సంతసించి "భో భో సాధక కిమాజ్ఞాపయసి?" అని ప్రశ్నించును. అపుడు సాధకుడు "మమ భార్యాభవ" అని జవాబిచ్చిన ఆమె అతని యందు ప్రీతి కలిగి సత్‌భావముతో రసరసాయన సిద్ధిద్రవ్యములను, దీర్ఘాయువును ప్రసాదించును. ముఖ్యముగా ఊర్వశీ సాధన సమయమున సాధకుడు భార్యను కూడా మదియందు తలచకూడదు. ఆ విధముగా తలంచిన అతడిని మరణము ఆశ్రయించును అదియును ఊర్వశి ఆగ్రహము వలననే.

## శ్రీ భూషా సాధన

**భూతడామరతంత్రే :**

**మంత్రము :** **ఓం వాః శ్రీం వాః శ్రీ భూషా ఆగచ్ఛా గచ్ఛ స్వాహా।**



**విధానం : కుంకుమేన భూర్జపత్రే శ్రీ భూషణీప్రతి మాంలిఖ్య రాత్రౌ వేకాకీశుచిః ప్రతి దినమష్ట సహస్రం జపేన్మాసమేకం యావత్ । మాసాంతే ఉదారపూజాం కృత్వా । తావజ్జపేత్ యావదర్ధరాత్రం నియతమాగచ్ఛతి ఆగతాసాశీఘ్రం కామితవ్యా । తుష్టాభవతి । సువర్ణము క్తాదీనిదదాతి దినేదినే కాముక భోజనం దదాతి రసరసాయనందదాతి**

**అనగా శ్రీభూషణీ సాధన కొరకు సాధకుడు కుంకుమ పువ్వుతో భూర్జపత్రమునందు శ్రీభూషణీ ప్రతిమను గీసి, ఆ ప్రతిమకు రాత్రి కాలమున నిర్జనప్రదేశమును ఒంటరిగా ఉండి పూజలు చేసి పై మంత్రమును ఎనిమిదివేల పర్యాయములు జపించవలయును.**

ఈ ప్రకారముగా ఒక మాసము రోజులు ఆచరింపవలయును. చివరి రోజున యధాతధంగా శ్రీ భూషణీ ప్రతిమకు ధూపదీప నైవేద్యము లను సమర్పించి అర్ధరాత్రి వరకు జపము చేయవలయును. అర్ధరాత్రి దాటు తుండగా శ్రీభూషణీ సాధకునకు సాక్షాత్కరించును. అనంతరము ఆమెకు పూజలు సల్పిన ఆమె సంతసించి రసరసాయనమును సాధకునకు సమర్పించును. అంతేకాక ఆమె అతని యందు ఉండి ఎల్లవేళలా కాపాడుచుండును.

### వివిధ కాత్యాయినీ ప్రభావములు

## శుభకాత్యాయనీ సాధన

**భూతడామర తంత్రే :**

**మంత్రము :**

**ఓం సురతప్రియే దివ్యలోచనేకామేశ్వరిజగన్మోహనేసుభగే కాంచనమాలా విభూషణనూపురశబ్దే విశావిశపూరయ నధనం ప్రియం స్వాహా ॥**

**విధానము :**

**రాత్రౌరాజగృహే గత్వాఽష్ట సహస్రంజపేత్ । కరవీర కాష్ఠైరగ్నిం ప్రజ్వాల్య మాలతోయిపుష్పైః దది మధుఘృతా క్తైరష్ట శతం జుహూయాత్ । తదాపంచదినాంనంతరే మహోభూతేశ్వరీ భూతరాజ్ఞీ మహోకాత్యాయనీ పంచశత పరివారేణ మహోనూపురశబ్దే నాగచ్ఛతి। ఆగతాయై కుసుమే నార్ఘ్య దత్వా వక్తవ్యం మాతాభగినీ భార్యాభవేతి। యదిమాతా భవతినచిత్తందూషితవ్యందివ్యకాముక భోజనందాతి సువర్ణాలంకారం వాదదాతి। యదిభగినీభవతి తదా రాజ్యందదాతి యోజనశతాదపి స్త్రీయ మానీయ దదాతి। యది భార్యాభవతి తదా దివ్య స్త్రీ సంభోగం దదాతి । సర్వాః పరిపూరయతి। శతవర్ష సహస్రాణి జీవతి మృతో రాజకులే జాయతే ।**

అనగా సాధకుడు ఏకాంతముగా ఏదయినా రాజగృహమునందు నిశీధసమయములో వెడలి పై మంత్రమును ఎనిమిది వేలసార్లు జపము చేయవలెను. జపానంతరము ఎర్రగన్నేరు కాష్ఠములతో అగ్నిని ప్రజ్వలింప చేసి పెరుగు, తేనె, నెయ్యి లతో కలిపి జాజులతో ఎనిమిదివందల హోమము చేయవలయును. ఈ ప్రకారముగా ఐదురోజులు విడువక నిర్వహించిన మహోభూతేశ్వరి, భూతరాజ్ఞియు అయిన శుభ కాత్యాయినీ పరి వార సమేతంగా సాధకునికి సాక్షాత్కారమగును.

ఆమెను చూచి భయపడక గంధపుష్పములతో పూజించి ఆర్ఘ్యపాద్యములనిచ్చి “మాతాభగినీ వాభార్యావాభవ” అని పలికి ఆమెకి తల్లిగా గాని, భార్యగాగాని, సోదరిగా గాని ఏదో ఒక రూపమున కావలయునని కోరి తగు ఫలితములను స్వీకరించవలయును. సాధకునికి ఆమె అష్టైశ్వర్యములతో పాటు రాజ్యభోగములను కల్పించును.



# చండకాత్యాయనీ సాధన

**భూతడామర తంత్రే :**

**మంత్రము : ఓం ఐం కం రుద్రభయంకరి అట్టాట్టహాసిని సాధకప్రియే మహావిచిత్రరూపే రత్నాకరిసువర్ణ హస్తేయమని కృంతని, సర్వ దుఃఖ ప్రశమని ఊం ఉం ఉం ఈం హూం హూం హూం శీఘ్రం సిద్ధిం ప్రయచ్ఛ హ్రీం జః స్వాహా ॥**

**విధానము**

**రాత్రావేకలింగే గత్వా సహస్రం జపేదేక స్మిన్ దివసే నూపుర శబ్దః శ్రూయతే ద్వితీయేదివసేదివ్య స్త్రీ పురః తిష్ఠతి నదూషియతి నభాషయతి । తృతీయ దివసేచ భాషతే భోస్సాధక కిమాజ్ఞాపయసి సాధకేనవక్తవ్యం భో దేవి ఉపస్థాపికాభవేతి యావజ్జీవతి తావదుపస్థానం కరోతి పృష్ఠమారోప్య మేరుసాగ రాదీన్నయతివై శ్రవణగృహే గంధద్రవ్యమానీయదదాతి జంబూద్వీప పాదకే ఉత్తమ కన్యా రూపమానీయదదాతి జీవతి వర్ష శతాని పశ్చాన్మృతః సామంతకులేషుజాయతే ॥**

అనగా, ఒకే శివలింగమున్న ప్రదేశములో ఏకాంతముగా ఉండి రాత్రిసమయమందు ఆ లింగమున ఎదురుగా ఆసీనుడై పై మంత్రమును వేయి పర్యాయములు జపము చేయవలెను. ఈ విధముగా చేయునపుడు నూపుర శబ్దము వినపడును. అదే ప్రకారముగా రెండవరోజు నిర్వహించిన దివ్యస్త్రీరూపముతో చండకాత్యాయనీ వచ్చి ఎదురుగా కూర్చుంటుంది కాని పలుకదు.

మూడవరోజు మరల అదే ప్రకారముగా జపము నిర్వహించిన ఆమె పలుకుతుంది. అంతట ఆమె ‘భోసాధక। కిమాజ్ఞాపయసి’ అనగా

ఏమి నీ కోరిక? అని అడిగిన 'ఓ చండ కాత్యాయనీ ।ఉపస్థాపితవై యుండుము' అని సమాధానమిచ్చిన ఆమె ఎల్లప్పుడు సాధకునికి ఉపస్థాపితమై యుండును. అతడు కోరినపుడు 'భోదేవి। చండకాత్యాయని ఆగచ్ఛాగచ్ఛ" అని పిలిచిన ఆమె వచ్చి ఆతడు కోరిన కోర్కెలను తీర్చును.

## మంజు ఘోషా సాధన

**భూతడామర తంత్రే :**

**మంత్రము : ఓం శ్రీం మంజు ఘోషే ఆగచ్ఛాగచ్ఛ స్వాహా ॥**

అస్యవిధానం :

**ప్రతి పదమారభ్యపూజాం కృత్వా చందనేన మండలం కృత్వా గుగ్గులుధూపం దత్వాష్ట సహస్రం జపేత్త్రిసంధ్యం । తతః పూర్ణ మాస్యాం మహతీం పూజాం కృత్వా సకలాంరాత్రిం జపేత్। ప్రభాతే శీఘ్ర మాచ్ఛతి కుసుమాస నం,దద్యాత్ స్వాగతం వక్తవ్యం। భోభో సాధక కిమాజ్ఞాపయసి ఇతితదా సాధకేన వక్తవ్యం భార్యాభవేతి। తదారసరసాయనద్రవ్యాణిదదాతిపరస్త్రీసంగమం నకర్తవ్యం పంచసహస్రవర్షాణిజీవతి ॥**

అనగా పాడ్యమి రోజునుంచి మంజుఘోషయను కిన్నెరని చందనపుష్పములతో ధ్యానించి ఒక మండపము నిర్మించి గుగ్గిలము ధూపము చేసి పై మంత్రమును ఎనిమిది వేల పర్యాయములు జపించవలయును. ఆ రోజు నుంచి ప్రతినిత్యము ఇదే ప్రకారముగా నిర్వహించుచూ పూర్ణిమ వరకు చేసి ఆ రోజున ఆ కిన్నెరకు మహాపూజ, మహానైవేద్యములను నివేదించి ఆ రోజు రాత్రిజామంతయు కూడా మంత్రజపము చేయవలెను. అంతట ప్రాతఃకాలమున 'మంజుఘోష' ప్రత్యక్షమయి "భోభో సాధక కిమాజ్ఞాపయసి" అని అడిగిన సాధకుడు



"మమ భార్యాభవ" అని జవాబునీయవలెను. అనంతరము ఆమె ఆ సాధకునికి సిద్ధద్రవ్యములను ఇచ్చి దీర్ఘాయువును ప్రసాదించి ఆతని కోర్కెలను తీర్చుతుంది.

## రుద్రకాత్యాయినీ సాధన

**భూత డామరతంత్రే :**

**మంత్రము : ఓం హ్రీం హ్రీం హూం హూం హే హే ఫట్ స్వాహా ॥**

**విధానం :**

**శ్మశానేగత్వా, సహస్రం జపేద్దివసాని త్రీణి । తథా సర్వభూతిని రుద్ర కాత్యాయనీ శీఘ్రమాగచ్ఛతి । ఆగతాయాః కపాలే కంఠేచ చూర్ణం దేయం తుష్టాభవతి । వదతి చకిం మయాకర్తవ్యమితి । సాధకేన వక్తవ్యం మాతేవ భవేతి । మాతృవత్ప్రతి పాలయతి రాజ్యందదాతి సర్వాశాం పూరయతి మహాధనపతి ర్భవతి పంచవర్ష శతాని జీవతిమృతో రాజకులేజా యతే ।**

అనగా సాధకుడు ఏకాంతముగా రాత్రిసమయమున శ్మశానమున రోజుకి వెయ్యి పర్యాయముల చొప్పున మూడు రోజులు మంత్రజపము చేయవలెను. ఈ విధంగా చేసిన రుద్రకాత్యాయినీ సాక్షాత్కారము లభించును. ఆమెకు కపాలమందు, కంఠమందు, చూర్ణము నొసంగిన ఆమె తృప్తిచెంది 'కిం మయాకర్తవ్యం' అని తాను ఏమి చేయవలయునో తెలుపుమనును.

అంతట సాధకుడు "మాతాభవ" అని కోరుకొనిన రుద్రకాత్యాయనీ సయితం ప్రసన్నురాలై ఆతనికి తల్లిగా ఉండి అతడు కోరిన కోర్కెలను తీర్చి రాజ్యభోగములను సంప్రాప్తమగునట్లు చేయుచుండును.

# సురకాత్యాయినీ సాధన

**భూత డామరతంత్రే :**

**మంత్రము : ఓం భ్రూం ప్రూాం ఫట్ ॥**

విధానం :

**శూన్యేదేవాలయేగ త్వాష్ట సహస్రం జపేత్, తదాస్వయమేవ సురకాత్యాయనీ మహాట్టహాసం కృత్వా ఉ ష్టశత పరివారేణ నియతమాగచ్ఛతి । ఆగతాయైచంద నోదకేన ఆర్ఘ్యోదేయః । తుష్టాభవతి రసరసాయనంప్రయచ్ఛత్యష్ట శతపరివారస్య వస్త్రాలంకార భోజనాదీని దదాతి। పంచవర్ష సహస్రాణి జీవతి మృతో రాజకులే జాయతే ॥**

అనగా రాత్రి సమయమున శూన్యదేవాలయమునకు ఒంటరిగా వెళ్ళి పై మంత్రము ఎనిమిది వేలు జపము చేయవలెను. ఈ ప్రకారము ప్రతినిత్యము నిర్వహించుచున్న సురకాత్యాయనీ సాక్షాత్కారం లభించును.

ఆమెను చందన పుష్పములతో పూజించి పంచ, భక్ష్యములను నివేదించిన ఆమె సంతసము చెంది, సాధకునికి రసరసాయనమును ప్రసాదించును. దీర్ఘాయువును ఇచ్చి రాజభోగములను ప్రసాదించును.

# మనోహరీ సాధన

**భూతడామర తంత్రే :**

**మంత్రము : ఓం మనోహర్యై స్వాహా ॥**

**అస్యవిధానం :**

**పర్వత మూర్ధ్ని సమారూఢో ఉ ష్ట సహస్రంజపేత్రిసంధ్య మేకమాసం। ఏవం జపేసమాప్తే మహతీం పూజాం కృత్వామాంసం నివేద్య గుగ్గులు నాధూ పోదేయఃతావజ్జపేద్యావదర్ధరాత్రంమనోహరీ నియత మాగచ్ఛతి తస్యాన భేతవ్యం భో భోసాధక। కిమాజ్ఞాపయసి సాధకేన**



**వక్తవ్యంభద్రే – స్మద్భార్యా భవేతిస్కందే ఆరోప్యదేవ లోకమపినయతి తస్య కామిక భోజనం దదాతివాం ఛితంచ ॥**

అనగా సాధకుడు పర్వతశిఖరమునకు వెడలి నియమములతో ఉండి ఆసీనుడై మూడు సంధ్యలయందును పై మంత్రము ఎనిమిది వేలుసార్లు జపము చేయవలయును. ఈ ప్రకారముగా చేసి మనోహరీ కిన్నెరదేవికి, పూజలు నిర్వహించి మాంసమును నైవేద్యముగా పెట్టి, గుగ్గిలముతో ధూపము వేసి ఆమెను సంతృప్తి పరచవలయును.

అనంతరము తిరిగి యధాప్రకారముగా మంత్రజపమును నిర్వహించుచున్న మనోహరి కిన్నెర సంతసించి సాధకునికి సాక్షాత్కరించును. సాధకునికి "భో భో సాధక కిమాజ్ఞాపయసి" అని ప్రశ్నించును. ఆమె ప్రశ్నకు సమాధానంగా సాధకుడు ఆమెతో "భద్రే ఉ స్మ ద్భార్యాభవ' అని పలికిన యెడల ఆమె సంతసించి అతని కోర్కెలను తీర్చి అతనికి దీర్ఘాయువును, అష్టైశ్వర్యములను ఇచ్చును.

# కిన్నెర సాధనోపాయములు

## సురతప్రియా కిన్నెరీ సాధన

**భూతడామర తంత్రే :**

**మంత్రము : ఓం సురత ప్రియే స్వాహా।**

**అస్యవిధానం :**

**రాత్రౌనదీసంగమం గత్వా ఉ ష్ట సహస్రం జపేత్, మాసాంతే నియతమాగచ్ఛతి ప్రథమదివసే దర్శనం దదాతి, ద్వితీయ దివసే పురతస్తిష్ఠతి, వాచాభాషతే తృతీయ దివసే కామయితవ్యాని యతంతిష్ఠతి. భార్యా భవతిసర్వ కర్మాణి కరోతి, అష్టాదీనారాన్ వస్త్రయుగళం చదదాతి.**

అనగా రాత్రిజామున నదీసంగమమునకు వెడలి పై మంత్రమును ఎనిమిది వేలుసార్లు జపము చేయవలయును. మొదటి రోజు జపాంతర మున ఆ దేవి దర్శనమిచ్చును. రెండవరోజు మంత్ర జపాంతరమున ఆమె దర్శనముతో పాటు మాటలాడును. మూడవ రోజున మంత్ర జపాంతరమున ఆమె అతని కోర్కెలను తెలుపుమని పలికి అన్నింటిని తీర్చి సాధకుని సంతోషపెట్టును.

## విశాలనేత్రీ సాధన

**భూతడామర తంత్రే :**

**మంత్రము : ఓం విశాల నేత్రే స్వాహా ॥**

**విధానము :**

**నదీకూలే గత్వాఽ -యుతం జపేత్ ।పునర్మాసాంతేసకలాం రాత్రింజపేత్। ప్రభాతా నియతమాగచ్ఛతి। ఆగతాసాభార్యా భవతి। దినే దినేపంచదీ నారాన్ దదాతి॥**

అనగా సాధకుడు నదీతీరమునకు వెళ్ళి ఒంటరిగా ఉండి నిశీధి సమయమున విశాలనేత్రయను కిన్నెర శక్తిని ధ్యానించి చందన పుష్పము లతో పూజించి గుగ్గిలముతో ధూపము వేసి పై మంత్రమును పదివేల పర్యాయములు జపించవలయును. ఈ ప్రకారముగా నెలరోజులపాటు నిర్వహించి మాసాంతమున విశాలనేత్రీ శక్తికి వైభవోపేతంగా పూజలు నిర్వహించి తిరిగి మంత్రజపమును ఆ రోజు అంతయు నిర్వహించిన, ఆ సాధకునికి శక్తి ప్రాతఃకాలమునందు సాక్షాత్కరించును.

ఆమెకు ఆర్ఘ్యపాద్యములొనర్చి సంతోషపరచి సాధకుడు "మమ భార్యా భవ" అని కోరిన, ఆమె అతడు కోరిన ప్రకారము ఉండి ఆతడి కోర్కెలన్నింటిని తీర్చి అష్టైశ్వర్యములను సిద్ధింపచేయును.



## అశ్వముఖీ సాధన

**భూతడామర తంత్రే :**

**మంత్రము : "ఓం అశ్వముఖీ స్వాహా ॥**

**విధానము :**

**పర్వత మూర్ధని గత్వా ఽ యుతం జపేత్ ॥ తదాశీఘ్రు మాగచ్ఛతి, రస రూపేణ పురతఃతిష్ఠతిఆలింగ్యచుంబతి తిష్ణీం భావేన కామిత వ్యాభార్యాభవతి। అష్టౌదీనారాన్ ప్రయచ్ఛతి దివ్య కాముక భోజనంద దాతి.**

అనగా సాధకుడు ఏకాంతముగా పర్వత శిఖరములకు వెళ్ళి నియమనిష్ఠలతో యుండి పై మంత్రమును పదివేల పర్యాయములు జపించవలయును. ఈ విధముగా పదకొండు రోజులు నిర్వహించిన అశ్వముఖీదేవి సాక్షాత్కారం లభించుతుంది. ఆమెను ధ్యానించి పూజలు నిర్వహించిన సంతోషించి ఆ సాధకుడి కోర్కెలను తీర్చుతుంది.

## సర్వకిన్నెరీ సాధనోపాయము

**తదా క్రోధ సహిత :** **క్రోధ మంత్రం జపేత్ ॥**

**క్రోధమంత్రో యధా :** **ఓం హ్రీం ఆకట్టః కట్ట!**

**సః ఫట్ అస్యజపమాత్రేణ శిరఃస్ఫుటతి**

**శతఖండంవిశీర్యతితదాగచ్ఛతి॥**

పైన తెలిపిన కిన్నెరల సాధన విధములను యధావిధిగా నిర్వహించినను కిన్నెరల సిద్ధి లభించని యెడల క్రోధముతో పై క్రోధ మంత్రమును జపము చేసిన శీఘ్రముగా వారు సాక్షాత్కరించెదరు.

## చేయదగిన మంత్రములను తెలిసికొనుట

ఆకాశం వాయువు, అగ్ని, జలము, భూమి... ఈ అయిదు పంచ భూతముల సమ్మేళనమే సృష్టి. మంత్రములు, వాటి ఫలితములు అన్నీ ఏ మంత్రమును జపించితే ఆ మంత్రం ఫలము మాత్రము సాధకునికి సిద్ధిస్తుంది. మంత్రం అనునది భగవంతునికి సంబంధించినది. సృష్టి అనగా భగవంతుడు. అటువంటి భగవంతునికి సంబంధిత మంత్రాన్ని జపించిన ఆ మంత్రమునకు సంబంధించినదే ఫలితం ఉంటుంది.

కాని మరొకటి ఇవ్వజాలవు. ఒక్కొక్కమనిషికి ఒక్కొక్క మంత్రం జపము ఫలితాన్నిస్తుంది. మరికొందరికి ఆ మంత్రం ఇవ్వదు. వేరొక మంత్రం ఇవ్వవచ్చు.

కావున ఏ మంత్రము ఏ వ్యక్తికి లేదా సాధకునకు అనుకూలమో తెలుసుకొనెడి విధానమే అర్వణ చూచుట అని అంటారు. మంత్రము యొక్క ప్రారంభ అక్షరమునకు, సాధకుని పేరులో గల మొదటి అక్షరమునకు సంబంధం ఉండాలి. అట్టి పొంతన లేదా సంబంధం కుదరకుండా చేసెడి మంత్రజపము వలన అనేకానేక కష్టములు సంభవింపవచ్చును. ఈ విధానమునే అర్వణ చూచుట అంటారు.

కావున ఏ కోరికతోనైనను సాధకుడు మంత్రమును ప్రారంభించవలెనన్న అర్ణ్వణ చూచి అనుకూలంగా ఉంటేనే మంత్రజపము చేయుటకు సిద్ధపడవలెను. ఆ మంత్రం అర్ణ్వణ సరిగా అనుకూలించకపోయిన వేరొక అనుకూల మంత్రం అర్ణ్వణం చూసుకొని ప్రారంభించాలి. ఈ అర్ణ్వణ చూడడం ఏ విధముగానో తెలుసుకుందాం. ముందుగా క్రింది విధంగా గీసుకోవాలి.



### 1) సిద్ధ

| | |
|---|---|
| సిద్ధ (1) | సాధ్య (2) |
| అ-క-ద | ఉ-జ-ప |
| సుసిద్ధ (3) | అరి (4) |
| జ-మ | ఒ-డ-వ |

### 2) సాధ్య

| | |
|---|---|
| సిద్ధ (1) | సాధ్య (2) |
| ఆఖద | ఊ చ ఫ |
| సుసిద్ధ (3) | అరి (4) |
| ఇ-య | ఔ-ఢ-శ |

### 3) సుసిద్ధ

| | |
|---|---|
| సిద్ధ (1) | సాధ్య (2) |
| ఇ-గ-థ | ఋ-చ-బ |
| సుసిద్ధ (3) | అరి (4) |
| ఏ-ట-ర | అం-ణ-ష |

### 4) అరి

| | |
|---|---|
| సిద్ధ (1) | సాధ్య (2) |
| ఈ-ఘ-న | ౠ-ఘ-భ |
| సుసిద్ధ (3) | అరి (4) |
| ఐ-ఠ-ల | అః-త-స-హ-ళ |

పైన ఉన్న చక్రంలో 16 గళ్ళను నాలుగు భాగాలుగా విభజించి నాము. వీటిలో నాలుగు భాగాలు ఉన్నాయి. అవి మొదటిది అనగా '1' అనునది సిద్ధ, '2' అనునది సాధ్య, '3' అనునది సుసిద్ధ '4' అనునది అరి. 4 భాగాలకు నాలుగు సంఖ్యలను పెట్టి వాటికి పేర్లను ఇచ్చారు. ప్రతి భాగానికి అక్షరములను ఇచ్చారు. కావున మంత్రం జపించాలనుకునేవారు వారి పేరు నందలి మొదటి అక్షరము ఏ భాగమునందు ఉన్నదో వారికి ఆ భాగం సిద్ధిభాగం అవుతుంది. అక్కడ నుంచి సవ్య క్రమంలో మిగిలిన భాగాలు సాధ్య, సుసిద్ధ, అరి భాగాలు ఉంటాయి. సాధకుని పేరునందలి మొదటి అక్షరం గల భాగం నుంచి మంత్రం ప్రారంభము నందున్న అక్షరం ఏ భాగంలో ఏ గడిలో ఉందో జాగ్రత్తగా చూసుకోవాలి. సిద్ధ, సాధ్య, సుసిద్ధ భాగములు అందున్న గడులు ఉత్తమమైనవి.

అరి భాగము నందలి గడులయందున్న అక్షరములు మంత్రం మొదట ఉండిన ప్రమాదకరం. దీని తరువాత సిద్ధాది నాలుగు భాగాలలో సిద్ధ, సాధ్య, సుసిద్ధ, అరి అను ఉపభాగములను కూడా గమనించి మంత్రమును ఎంచుకోవాలి.

*ఉదాహరణకు :*

కామేశ్వరరావు అను పేరుగల వానిలోని మొదటి అక్షరము 'క' కు సంబంధించినది. ఈ అక్షరము నెం1 సిద్ధ భాగంలో మొదటిదియైన సిద్ధగడియందున్నది. గణపతి మంత్రం తీసుకున్న ఈ మంత్రం యందలి మొదటి అక్షరం గం. ఈ అక్షరం 3 నెం'సుసిద్ధ' భాగంలో మొదటిదియైన 'సిద్ధ' గడియందున్నది. కావున ఈ మంత్రము "సుసిద్ధసిద్ధము" అనగా మంచి ఫలితముల నిచ్చునది. అనగా సాధకుడు తన పేరుతో అనుకూలమైన ఈ అరవణ విధానమును తెలుసుకొని మంత్రజపమును ఎంచుకోవాలి.

***ఇంకొక ఉదాహరణను తీసుకుందాం :***

శంకర్ కుమార్ అనే పేరుగల వ్యక్తి. మొదటి అక్షరం శ.....ఈ అక్షరం వరుస నెం.2 సాధ్య భాగంలో 4వదగు అరిగడిలో ఉన్నది. కాని ఈ భాగం శ, పేరులో మొదటి అక్షరముగా గలవారికి (మరియు ఆఖద ఊ చఫ. ఔఢశ, ఇ యలు మొదటి అక్షరముగా గలవారికి) సాధ్య భాగముగానే పరిగణించాలి. వీరికి ఒక మంత్రమునందలి మొదటి అక్షరము 'ఝం' నెం.4 'అరి' భాగమందలి 3వదగు 'సుసిద్ధ' గడియందున్నది. అనగా ఈ మంత్రము 'అరిసుసిద్ధ మంత్రము' అనగా వీరి పేరుకు పూర్తిగా విరుద్ధమయి నది. ఈ ప్రకారముగా తమకు మంత్రము మంచిదో, విరుద్ధమైనదో తెలుసుకొని సాధన ప్రారంభించిన సత్ఫలితాలను పొందగలరు.



## అర్హణ ఫలిత వివరణ

**1వ భాగమునందున్న అర్హణ ఫలితములు**

**1. సిద్ధ-సిద్ధము :**

విధానమును యధావిధిగా నిర్వహించిన ఫలము సాధ్యపడును.

**2. సిద్ధ-సాధ్యము :**

తెలియచెప్పిన దానికంటే రెండింతలు సాధన చేసిన ఫలితము సిద్ధించును.

**3. సిద్ధ-సుసిద్ధము :**

ఈ ప్రకారమున సాధన చేయుచుండగనే ఫలితము కలుగును.

**4. సిద్ధ-అరి :**

తన వంశమునందలి వారు చెడు ఫలితములు పొందగలరు.

**2వ భాగమునందున్న అర్హణ ఫలితములు**

**1. సాధ్య-సిద్ధము :**

ఈ విధానమున సాధన అధికంగా చేసిన ఫలితం దక్కుతుంది.

**2. సాధ్య-సాధ్యము :**

పలు ప్రయత్నములు చేయుటవలన ఫలితం పొందగలరు.

**3. సాధ్య-సుసిద్ధము :**

శీఘ్ర ఫలితం పొందగలరు.

**4. సాధ్య-అరి :**

ప్రతివిషయంలో ఎదురుదెబ్బ తగులుతుంది.

**3వ భాగమునందున్న అర్హణ ఫలితములు**

**1. సుసిద్ధ - సిద్ధము :**

సాధన ప్రారంభమునందేఫలితముకనపడుతుంది.

**2. సుసిద్ధ - సాధ్యము :**
హోమాదికార్యక్రమములు వంటివి జరిపిన, ఫలితం కలుగుతుంది.

**3. సుసిద్ధము - సుసిద్ధము :**
సాధన పూర్తయిన తక్షణమే సిద్ధి కలుగును.

**4. సుసిద్ధ - అరి :**
వంశహాని కలుగును.

**4వ భాగమునందున్న అర్వణ ఫలితములు**

**1. అరి - సిద్ధము :**
కుమారునకు హాని, ప్రాణనష్టము కలుగవచ్చు.

**2. అరి - సాధ్యము :**
పుత్రికకు హాని, ప్రాణనష్టము కలుగవచ్చు.

**3. అరి - సుసిద్ధము :**
భార్యకు హాని, ప్రాణనష్టము.

**4. అరి - అరి :**
సాధకునికే అరిష్టము సంభవించును.

## యక్షిణీ దేవతల సాక్షాత్కారం కొరకు సులభ సాధనోపాయములు

**రుద్రయామళతంత్రే :**

శ్లో ॥ **దేవ్యువాచ-దేవి ప్రశ్నించెను.**
**కృతంచ సాధనం సర్వం యక్షిణీనాం సుఖప్రదం।**
**కస్మిన్కాలే ప్రవర్తవ్యం విధినా కేనవాప్రభో ॥**
**అత్రాధికారిణః కేవాసమాసే నవావదస్వమే ।**



తా॥ ఓ ప్రభూ । ఓ పరమశివా ! శుభప్రదములు, సుఖప్రదములు అయిన వివిధ యక్షిణీ దేవతల సాధనా విధములు మీచే తెలుపబడినవి. అన్నింటిని అవగతము చేసుకొని యుండిన గాని ఆ యక్షిణీ దేవతల సులభ సాధనో పాయముల కొరకు ఏ కాలమందు, ఏ విధము పాటించవలయునో, ఇంతటి బృహత్తరమైన కార్యమును ఉపాసించుట ఎట్టివారలు అధికారులగుదురో దయతోచెప్పవలసినదిగా తన నాథుని కోరినది పార్వతీ మాత.

ఈశ్వర ఉవాచ దేవి ప్రశ్నలకు ఈశ్వరుడు తెలుపుచున్నాడు.

శ్లో ॥ **వసంతే సాధయేద్ధీమాన్ హవిష్యాశీ జితేంద్రియః ।**
**సదా ధ్యానపరో భూత్వాతద్దర్శన మహోత్సవః ॥**
**నిర్జనే శిఖరేవాపి కామరూపే విశేషతః ।**
**స్థానేష్వేకత మంత్రాప్య సాధయేత్సు సమాహితః ॥**
**అనేనవిధినా సాక్షాద్భవత్యేవ నసంశయః ।**
**శ్రీ దేవ్యుపాస కాస్సర్వే సర్వంచైవాధి కారిణః ॥**
**అగ్నిహోత్ర విశేషేణ సాధయేద్య క్షిణీః శుభాః ॥**
**సర్వసాం యక్షిణీ నాంతు ధ్యానం కుర్యాత్సమాహితః ॥**
**భగినీ మాతృపుత్రీ స్త్రీ రూపతుల్యాయ ధేప్సితాః ॥**

**విధానము :**

బుద్ధికుశలుడు, జ్ఞానము కలిగిన సాధకుడు సాధారణముగా వసంత ఋతువు నందు యక్షిణీ దేవతలను జపించి వారి అనుగ్రహమును సాధింపవలయును, అదే విధముగా సాధకుడు జితేంద్రియుడై యక్షిణీ దేవతలను సాధింపవలయును. సాధకుడు సాధన సమయమున బియ్యము, నెయ్యి కలిపి వండబడిన హవిస్సును ఆహారముగా తీసుకొన వలయును.

మనస్సును ఏమాత్రం నిరాశకు గురిచేయకుండా యక్షిణీ దేవత సాక్షాత్కారము అవుతుందనెడి సంతోషంతో నమ్మకంతో ఆ దేవతను ధ్యానిస్తూ మంత్రజపము చేయుచుండవలయును.

ఏకాంతప్రదేశమునందు అనగా నిర్జనముగా ఉన్న ప్రాంతము, అరణ్యప్రాంతమునందు, కామరూప క్షేత్రము నందు (గౌహతి) ధైర్య మనోబల మనస్కుడై జపించవలయును. ఈ విధమైన జపము వలన యక్షిణీ దేవతల సాక్షాత్కారము త్వరితగతిన లభించును. ఈ యక్షిణీ దేవతల సాధనకొరకు భక్తి తత్పరులయిన దేవీ సేవకులు అధికారు లగుచున్నారు.

తారక బ్రహ్మమునకు భృత్యులుగా ఉన్న వారలకు మాత్రము ఈ దేవతలను సాధించు అధికారము లేదు. మిగిలిన వారలకు మాత్రము యక్షిణీ దేవతల సాధనకు అధికారము కలదు. ఇంకను నిత్యాగ్నిహోత్రము గలిగిన యక్షిణీదేవతలను సాధించుటకు విశేష అధికారము కలిగి యున్నారు.

ఏ సాధకుడయినా సర్వయక్షిణీ దేవతలను మాతృరూపముగ గాని, సోదరీ రూపముగగాని, పుత్రికా రూపముగగాని, భార్యరూపమున గాని తన ఇష్టానుసారముగా గాని భావించి ధ్యానించవలయును.

శ్లో ॥ **మాతాస్యాద్యదిసా దేవీ పుత్రవత్పాలయేన్ముదా।**
**సిద్ధిద్రవ్యం మనోభావం దదాతిహిదినేదినే ।**
**అతీతా నాగతాంవార్తాం సర్వం జానాతిసాధక।**
**భార్యాస్యాద్య దిసాదేవీ దదాతివిపులంధనం ।**
**అన్నాద్యైరుపహారైశ్చ దదాతి కామభోజనం ।**



**సదాస్వర్ణశతం తస్మై సాదదాతి ఫలంప్రియే ।**
**యద్యద్వాంఛతి సర్వంచ దదాతి చ న సంశయః ॥**

**విధానము :** సాధకుడు యక్షిణీదేవతను భావించిన, తలంచిన విధానమును బట్టి సాధకునికి ఆ దేవత ఆశీస్సు లభించును. మాతృ భావనతో యక్షిణీదేవతను కొలచిన సాధకునికి ఆ దేవి కుమారునివలె భావించి తన కుమారుని భవిష్యత్తును బంగారు బాటగా చేయును. ఆతనికి సిద్ధిద్రవ్యమును ఇచ్చి భూతభవిష్య వర్తమానములను తెలుసు కొనెడి శక్తిని ప్రసాదించును.

సాధకుడు ఆ దేవిని భార్యా భావముతో ధ్యానించిన అష్టైశ్వర్యము లను సిద్ధింపచేయుటయే కాక పంచభక్ష్యములతో నున్న కామభోజన మును ప్రతిదినము సంప్రాప్తమగునట్లు దీవించును.

శ్లో ॥ **స్వసాదదాతి విత్తంచ దివ్యం వస్తుతథైవచ ।**
**దివ్యకన్యాంసమానీయ నాగ కాన్యా దినేదినే ।**
**భ్రాతృవత్పాలయేల్లోకే నామభిస్తుమనోగతైః ॥**

ఇంకను సాధకుడు యక్షిణీదేవిని సోదరీభావముతో తలంచి జపించిన అతని మనోవాంఛలనన్నింటిని దేవి సిద్ధింపచేయును.

## యక్షిణీ సాధన విధానము

**యది యక్షిణీ సమయేన తిష్ఠతి తదాక్రోధ**
**మంత్రంపఠిత్వాక్రోధముదయా-కర్షయేత్॥**
**తథాశీఘ్రమాగచ్ఛతి। యదినాగచ్ఛతి ।**
**యక్షిణీమూర్ధ్నివాస్ఫుటతి।**
**తత్క్షణాన్మ్రియతే మహానరకేపతతి ॥**

## క్రోధమంత్రము

**ఓం జూం కట్ట కట్ట అముక యక్షిణీ**
**హ్రీం యః యః హూం ఫట్ ॥**
**అనేన క్రోధమంత్రం సహస్రమేకం జపేత్ ॥**

అర్ధము ఏమనగా సాధకుడు సాధన మంత్రమును సాధన ప్రక్రియలో తెలిపిన విధముగా ఆచరించినా యక్షిణీదేవి సాక్షాత్కరించని యెడల క్రోధముద్రతో ఆకర్షణచేసి పైనతెలిపిన క్రోధమంత్రమును వెయ్యి పర్యాయములు జపించిన యెడల తప్పక ప్రత్యక్షమగును.

**క్రోధముద్రా లక్షణంతు :**
**ముష్టింకృత్వాకనిష్ఠ ద్వయంవేష్టయేత్ తర్జనీంప్రసర్యాంకుర్యాత్ ।**
**ఏషా -ప్రతిహత క్రోధాంకుశముద్రాక్షణేన త్రైలోక్య మప్యాకర్షయేత్।**

2 పిడికిళ్లు బిగించి 2 చిటికెనవేళ్లు పరస్పరం లింకువేసి - చూపుడువేళ్లు ముందుకు చాపితే క్రోధముద్ర ఏర్పడుతుంది.

## ఆవాహన మంత్రము

**మంత్రము : ఓం హ్రీం అగచ్ఛ అముక యక్షిణీ స్వాహా।**

యక్షిణీ దేవి యొక్క ఆవాహనమునకు ఈ మంత్రమును పఠించ వలయును.

## పునరాగమన మంత్రము

**అస్యాతివముద్రాయా వామాంగుష్ఠం విసర్జయేత్ ॥**
**మంత్రము : ఓం హ్రీం గచ్ఛాముక యక్షిణీ శీఘ్రం**
**పునరాగమనాయ స్వాహా।**



అనగా సాధకుడు తనకి సాక్షాత్కరించిన దేవిని మరల సాక్షాత్కరింప చేసుకొనుటకు పై మంత్రమును పఠించవలయును.

## అభిముఖీకరణ మంత్రము

**ముష్టిం తర్జనీం మధ్య మాంగుళిం ప్రసారయేత్ ।**
**సర్వయక్షిణ్యభి ముఖీకిరణముద్రా.**

**మంత్రము : ఓం మహాయక్షిణీ మైధున ప్రియేస్వాహా।**

తా॥ యక్షిణీదేవిని అభిముఖంగా చేసుకొనుటకు ఈ మంత్రమున పఠించ వలయును.

## సాన్నిధ్య కరణ మంత్రము

సాన్నిధ్య కరణ ముద్రా
**మంత్రము : ఓం కామేశ్వరీ స్వాహా॥**
**ముష్టింకృత్వా ప్రసార్యా కుంచయేత్। సర్వయక్షిణీ**
**సాన్నిధ్యకరణముద్రా**

యక్షిణీదేవి సాన్నిధ్యం కొరకు పై మంత్రమును జపించవలయును.

## హృదయ మంత్రము

**మంత్రము : హ్రీం**
**హస్తంఘటాకారేణ సంస్థాప్య యక్షిణీ హృదయ ముద్రా**

అనగా చేతిని కుండ ఆకారములో నుంచి హృదయ మంత్రమును మనస్ఫూర్తిగా పఠించవలయును.

## ధూపాదులను సమర్పించు మంత్రము

**మంత్రము :** ఓం సర్వమనోహారిణీ స్వాహా ॥

**ముద్ర :** ముష్టిం కృత్వా తర్జనీం మధ్యమాం ప్రసారయేత్ । సర్వ యక్షిణీ గంధ పుష్ప ధూప దీపముద్రా

అనగా పై మంత్రమును పఠించుతూ దూప దీప ముద్రతో యక్షిణీ దేవికి గంధపుష్ప ధూపదీపము లను సమర్పించవలయును. కావున సాధన పైన తెలిపిన విషయముల నన్నింటిని గ్రహించి యక్షిణీ దేవతలను భక్తిప్రపత్తులతో సాధించవలయును.

## సాధకులకు సలహాలు, సూచనలు

ప్రాచీనమైన కొన్ని మంత్రములు గురువులద్వారా మాత్రమే ఉపదేశము పొందవలెను. ఈనాటికీ వాటి రహస్యం తెలియలేదు. కొన్ని మంత్రములకు ఇంతవరకు తెలిపిన యక్షిణీ విద్య లు, అప్సరసలు, సుందరీలు, కాత్యాయినీల సాధనోపాయములతో సాధించతలచిన వారు శాంతి, వశ్యము, ఆకర్షణ, విద్వేషణ, స్తంభన, మారణాది షట్కర్మల స్వరూపములను, వాని అధిదైవము లను, లక్షణ నిబంధముల వంటి వాటినన్నింటిని పూర్తిగా అవగతము చేసికొని అందలి యోగ్యమైన విధానములను అనుసరించి యక్షిణీ దేవతలను పూజించి ధ్యానించి, శాస్త్రము తెలిపిన ప్రకారముగా సాధన చేసిన యక్షిణ్యాదులు సులభముగా సిద్ధించును. ఎటువంటి చపలచిత్తములకు లోనయిననూ యక్షిణీ దేవతల సాక్షాత్కారము దుర్లభము, ప్రాణసంకటము కూడా.



# ఉడ్డీశ తంత్రం

(రావణబ్రహ్మకు శివుడుపదేశించిన షట్కర్మ తంత్రములు)

## ఆహ్వానం

తంత్రసాధనలో జపమునకు ప్రముఖ స్థానమున్నది. సర్వజ్ఞుడైన పరమేశ్వరుడు సకల తంత్రములకు ఉపదేష్ట ఈ "ఉడ్డీశ తంత్రం" రావణ బ్రహ్మకు ఉపదేశించినట్లుగా చెప్పబడింది. తంత్రసాధకులు ముందుగా తాంత్రిక శివగాయత్రి మంత్రమును 24లక్షలు జపించి పురశ్చరణ చేయాలి. ఐహికమైన అభివృద్ధి కోరువారు ఉపాంశు జపము చేయాలి. కేవలం మోక్షమును కోరువారు మానసిక జపం చేయాలి. ఇది గురుపరంగా తెలుసుకొని అనుభవంలో చెబుతున్న శాస్త్రవచనం.

పంచాక్షరి మంత్రం 1 నిముషమునకు 100సార్లు జపమగును. 1 గంటకు 6 వేలగును. 84 గంటలు చేసినచో 5 లక్షల జపమగును. రోజూ క్రమం తప్పకుండా టైము చూసుకొని 3 గం॥లుగాని 4 గం॥లు గాని జపం చేసి, ఒక పుస్తకములో వ్రాసుకొనవలెను. ఈ విధముగా జపము జరిగిన గంటలు నోట్ చేసుకొని 100గంటలు పూర్తయిన తరువాత పురశ్చరణ చేయవలెను. "జపతో నాస్తి పాతకం" జపంవల్లనే పాపములు నశించును. పుణ్యము కలుగును. జపసాధకుడు కొన్ని నియమములు పాటించ వలెను. క్రోధము వహించరాదు. నిత్య సంతోషముగా నుండవలెను.

ఒక సంవత్సరము సాధన చేసిన వాక్సిద్ధి లభించును. సాధకుని మాటలు అందరూ శిరసావహింతురు. వశీకరణశక్తి లభించును. పూర్వజన్మ కర్మ ననుసరించి కొందరికి ఆలస్యమగును. నిరాశ చెందరాదు.



మంత్రజపము పర్వతశిఖరములందు, సిద్ధక్షేత్రములలో నదీతీరము లందు, వటవృక్ష తలములో, జ్యోతిర్లింగ శివాలయములో, శక్తిపీఠ దేవాలయములో భగ్న శివాలయములో, ఏకాంతములో, జలపాత సన్నిధిలో, నిర్జన స్థలములో చేసినచో శీఘ్రముగా ఫలించును. వాగ్గేయకారుడైన త్యాగయ్యకు 96కోట్ల "రామ"నామ జపంచేత శ్రీరామ దర్శనం లభించింది. అపుడే "బాల కనకమయచేల సుజన పరిపాల" అనే కీర్తన ఆశువుగా పాడారు. విద్యారణ్య స్వామి 13 మహాపురశ్చరణలు చేసి జన్మజన్మల పాపాలు పోగొట్టుకొని అమ్మవారి దర్శనం పొందారు.

శివపంచాక్షరి రోజూ 4 గం॥లు, జపం చేసినచో 4,200 రోజులలో, అనగా 11 సంవత్సరముల 6 నెలల 20 రోజులలో, 1 కోటి జపమగును ఎంతో విలువైన కాలం వృధా చేయకండి. మీ శక్తి సామర్థ్యముల ననుసరించి, సాధన ప్రారంభించిన క్రమేణా అదే అభివృద్ధి చెందుతుంది. మంత్ర-తంత్రములను ఆత్మశ్రేయస్సుకు, పరోపకారా నికి, దుఃఖనివృత్తికి ఉపయోగించాలి. దుష్కర్మలకు, పగ-ప్రతీకారములకు వినియోగించిన దాని ఫలితం కూడా కర్మరూపేణ ప్రాప్తిస్తుంది. ఐహిక శ్రేయస్సుకై సత్కర్మ జపసాధనలే రాజమార్గములు.

ప్రాచీనములైన తంత్రశాస్త్ర పుస్తకములన్నియు సంస్కృతమునుండి తెలుగు అనువాదముతో ప్రచురించ దలచినాము.

మహాశివరాత్రి
1999

తంత్రజిజ్ఞాసువు
**మేడవరపు సంపత్ కుమార్**

# ఉడ్డీశ తంత్రం

శ్లో॥ కైలాసశిఖరే రమ్యే నానారత్నోపశోభితే ।
నానాద్రుమలతాకీర్ణే నానాపక్షిరవైర్యుతే ॥
సర్వర్తు కుసుమామోద మోదితే సుమనోహరే
శైత్యసౌగంధ్య మందాఢ్యైర్మరుద్భిరుపవీజితే ॥
అప్సరోగణ సంగీత కలధ్వని-నినాదితే
స్థిరచ్ఛాయ ద్రుమచ్ఛాయాది తేస్నిగ్ధమంజులే ॥
మత్తకోకిల సందోహ సంఘుష్ట విపినాంతరే
సర్వదా స్వగణైః సార్ధం ఋతురాజనిషేవితే ॥
సిద్ధచారణ గంధర్వైః గాణపత్యగణైఃవృతే ।
తత్ర మౌనధరం దేవం చరాచర జగద్గురుమ్ ॥

తా॥ అందమైన కైలాస శిఖరంమీద పార్వతీ పరమేశ్వరులు కూర్చుని యున్నారు. అనేకరకముల పుష్పలతలు వివిధ పక్షిగణముల మధుర కలకల ధ్వని, చల్లగా వీచే సుగంధ పరిమళాలు, అప్సరసల సంగీతాలాపన. పెద్దపెద్ద మహావృక్షాల దట్టమైన నీడతో హిమాలయారణ్యాలు మనోహరంగా ఉన్నాయి. సిద్ధులు, గంధర్వులు, చారణులు, గాణాపతులు చేరి, జగద్గురువు, జగత్పిత అయిన పరమేశ్వరుని పరివేష్టించి యున్నారు. శివుడు మౌనంలో ఉన్నాడు.

శ్లో॥ సదాశివం సదానందం కరుణామృత సాగరం
కర్పూరకుంద ధవళం శుద్ధం సత్వగుణం విభుం ॥
దిగంబరం దీననాథం యోగీంద్రం యోగివల్లభం
గంగాశీకర సంసిక్తం జటామండల మండితం ॥



విభూతి భూషితం శాంతం వ్యాలమాలం కపాలినం
త్రిలోచనం త్రిలోకేశం త్రిశూల వరధారిణం ॥
ఆశుతోషం జ్ఞానమయం కైవల్య ఫలదాయకం
నిరాతంకం నిర్వికల్పం నిర్విశేషం నిరంజనం ॥
సర్వేషాం హితకర్తారం దేవ దేవం నిరామయం
అర్ధచంద్రో జ్జ్వలద్భాలం పంచవక్త్రం సుభాషితం ॥
ప్రసన్న వదనం వీక్ష్యలోకానాం హితకామ్యయా
వినయేన సమాయుక్తో రావణః శివమబ్రవీత్ ।

తా॥ కర్పూరమువలె తెల్లనైనవాడు, శుద్ధసత్వగుణ స్వరూపుడు, దిగంబరుడు, దీననాథుడు, గంగానదీ ప్రవాహతుషార బిందువులచేత తడిసిన పంచముఖుడు, విభూతిధారి, జ్ఞానస్వరూపుడు, యోగి, జటాజూటధారి, త్రిశూల, సర్పమాలా కపాలధారి, ఆశుతోషుడు (శీఘ్రముగా సంతోషించు వాడు) అయిన శివుని, లోకహితంకోరి లంకాపతి అయిన రావణబ్రహ్మ వినయముగా ఈ విధముగా ప్రశ్నించాడు.

## రావణ ఉవాచ

శ్లో॥ నమస్తే దేవేశ సదాశివ జగద్గురో
తంత్రవిద్యాం క్షణంసిద్ధిం కథయస్వ మమప్రభో ॥

## శివ ఉవాచ

శ్లో॥ సాధుపృష్టం త్వయాత్సలోకానాంహిత కామ్యయా
ఉడ్డీశాఖ్య మిదంతంత్రం కథయామితవాగ్రతః ॥
ప్రస్తకేలిఖితావిద్యా నైవసిద్ధి ప్రదానృణాం
గురుంవి నాహిశాస్త్రేస్మిన్ నాధికారః కథంచన ॥

**అథాభిధాస్యే శాస్త్రేస్మిన్ సమ్యక్ షట్కర్మలక్షణం**
**తన్మంత్రానుసారేణ ప్రయోగ ఫలసిద్ధిదం ॥**

తా॥ సదాశివ! క్షణకాలములో సిద్ధించు తంత్రవిద్యను ఉపదేశించు స్వామీ, అని రావణబ్రహ్మ పరమశివుని ప్రార్థించగా శివుడు భక్తాను గ్రహముచేత ఉడ్డీశ తంత్రమును బోధించెను. ఇది గురువులేనిదే సిద్ధించదు. పుస్తకము చూసి ఆచరించినచో ఫలితముండదు.

శ్లో॥ **శాంతివశ్యస్తంభనాని విద్వేషోచ్చాటనే తథా**
**మారణాంతాని శంసంతి షట్కర్మాణి మనీషిణః ॥**

తా॥ తంత్రశాస్త్రములో షట్కర్మలున్నవి 1) శాంతి 2) వశీకరణం, 3) స్తంభనం, 4) విద్వేషణం, 5) ఉచ్చాటనం, 6) మారణం వీటి లక్షణములు చెప్పుచున్నాను.

శ్లో॥ **రోగకృత్యా గ్రహాదీనాం నిరాసః శాంతిరీరితా ।**
**వశ్యం జనానాం సర్వేషాం విధేయత్వముదీరితం**
**ప్రవృత్తిరోధః సర్వేషాం స్తంభనం సముదాహృతం**
**స్నిగ్ధానాం ద్వేషజననం మిథో విద్వేషణం మతం ॥**
**ఉచ్చాటనం స్వదేశాదేః భ్రంశనం పరికీర్తితం**
**ప్రాణినాం ప్రాణహరణం మారణం సముదాహృతం ॥**

తా॥ రోగములను - గ్రహబాధలను - ఇతరులు చేసిన ప్రయోగములను తొలగించునది శాంతికర్మ జనులను తనకు విధేయులుగా చేయునది వశీకరణం. ఎదుటివారి ప్రవృత్తిని అడ్డగించునది స్తంభనం స్నేహితులుగాని పరస్పరం ఎంతో ప్రేమతో ఉన్నవారు ద్వేషించుకోవడం విద్వేషణం, ఉన్న ఊరువదలి వెళ్ళిపోవడం ఉచ్చాటనం, ప్రాణహరణం మారణం. ఇవియే షట్కర్మ లక్షణములు.



శ్లో॥ **అన్యానపి ప్రయోగాంశ్చ బహూన్ శృణ్వసురాధిప**
**ఔషధం చతథా గుప్తం కార్యంవక్ష్యామి యత్నతః ।**
**ఉడ్డీశం యో నజానంతి సరుష్టః కింకరిష్యతి**
**మేరుం చాలయతే స్థానాత్ సాగరేప్లావయేన్మహీం ।**
**మోహితః శంకితశ్చాపి నిందకశ్చ విశేషతః**
**అభక్తాయ నదాతవ్యం తంత్రశాస్త్రమను త్తమం ।**
**తథేతైః సహసంయోగే కార్యం నోడ్డీశకీ ధృవం**
**యదిరక్షేత్ సిద్ధిమేతాం ఆత్మానంతు తథైవచ**
**దేవతాగురు భక్తానాం దాతవ్యం సజ్జనాయ చ ॥**

తా॥ ఓ రావణా! ఈ ఉడ్డీశతంత్రమందు అనేక ప్రయోగములు, విద్యలు, ఔషధములు ఉన్నవి. సావధానుడవై వినుము. ఈ తంత్రము తెలియనివారు ఎంత కోపగించిననూ ఏమీ చేయలేరు. ఈ తంత్రము తెలిసినవారు మేరుపర్వతము కదలించగలరు. భూమిని సముద్రములో తేల్చగలరు. దీనిని నమ్మకము లేనివారికి, దూషించువారికి, భక్తిలేనివారికి ఉపదేశించరాదు. వీరికి ఈ విద్య సిద్ధించదు. దీనిని ఆత్మరక్షణకు ప్రయోగించవలయును. దేవ, గురు, భక్తులకు మాత్రమే ఉపదేశించ వలయును.

శ్లో॥ **నతిథిర్న చ నక్షత్రం నియమోనాస్తివాసరః**
**నవ్రతం నియమో హోమః కాలవేళా వివర్జితం ॥**
**కేవలం తంత్రమాత్రేణ ఓషధీ సిద్ధిరూపిణీ**
**యస్యసాధన మాత్రేణ క్షణాత్సిద్ధిశ్చజాయతే ॥**
**శశిహీనా యథారాత్రిః రవిహీనం యథాదినం**
**నృపహీనం యథారాజ్యం గురుహీనం చమంత్రకం**
**అపకారిషు దుష్టేషు పాపిష్ఠేషు జనేషు చ**

ప్రయోగైర్వన్యమానేషు దోషోనైవ ప్రజాయతే
యోజయే దనిమిత్తంయః ఆత్మఘాతీ నసంశయః

తా॥ ఈ తంత్రశాస్త్ర ప్రయోగములో తిధి - వార - నక్షత్ర నియమములు లేవు. వ్రతహోమములు అవసరం లేదు. కేవలం సిద్ధౌషధి వలననే కోరికలు నెరవేరును. సూర్య చంద్రులు లేని పగలు - రాత్రులు, రాజులేని రాజ్యం ఎటు వంటివో గురువులేని మంత్రవిద్య యోగించదు అపకారము చేసిన దుష్టులయందు, పాపులయందు అభిచారము చేసిననూ దోషము లేదు. కారణము లేనిదే చేసినచో ఆత్మహత్యా సదృశమగును.

## శతృమారణ కవచం

ఓం అస్యశ్రీ కాళికా కవచస్య భైరవ ఋషిః ॥
గాయత్రీ ఛందః శ్రీకాళీదేవతా ॥ సద్యః శతృ
హననార్థే జపేవినియోగః

## ధ్యానం

ధ్యాత్వాకాళీం మహామాయాం త్రినేత్రాం బహురూపిణీం చతుర్భుజాం లోలజిహ్వా పూర్ణ చంద్ర నిభాననాం । నీలోత్పల దళశ్యామాం శతృసంఘ విదారిణీం ॥ నరముండం తధాఖడ్గం కమలంవరదం తధా ॥ బిభ్రాణాం రక్తవసనాం ఘోరదంష్ట్రా స్వరూపిణీం ॥ అట్టాట్టహాస నిరతాం సర్వదా చదిగంబరాం ॥ శవాసన స్థితాం దేవీం ముండమాలా విభూషితాం ॥

## కవచం

శ్లో॥ ఓం కాళికా ఘోరరూపాధ్యా సర్వకామప్రదాశుభా
సర్వదేవస్తుతాదేవీ శతృనాశం కరోతుమే



హ్రీంహ్రీం స్వరూపిణీచైవ హ్రీంహ్రీంసంహంగినీతధా
హ్రీంహ్రీం క్షౌంక్షౌం స్వరూపాసా సర్వదా శత్రునాశినీ ।
శ్రీం హ్రీం ఐం రూపిణిదేవీ భవబంధ విమోచనీ
యధాశుంభో హతోదైత్యో నిశుంభశ్చమహాసురః
వైరినాశాయ వందేతాం కాళికాం శంకరప్రియాం
బ్రాహ్మీశైవీ వైష్ణవీచ వారాహీ నారసింహికా
కౌమారీ శ్రీశ్చచాముండా ఖాదయంతుమమద్విషాన్
సురేశ్వరీ ఘోరరూపా చండముండ వినాశినీ
ముండమాలా వృతాంగీచ సర్వతఃపాతుమాం సదా
హ్రీం హ్రీం కాళికే ఘోరదంష్ట్రేచ రుధిరప్రియే

## మంత్రం

**రుధిరపూర్ణవక్త్రేచ రుధిరావితస్తిని మమ శత్రూన్ ఖాదయ ఖాదయ మారయ మారయ ఛింది ఛింధి ఛింధి ఛింధి ఉచ్చాటయ ఉచ్చాటయ ద్రావయ ద్రావయ శోషయ శోషయ యాతుధానికే చాముండే హ్రీం హ్రీం వాం వీం కాళికాయై సర్వశత్రూన్ సమర్పయామి స్వాహా ॥ ఓం జహిజహి కిటికిటి కిరికిరి కటుకటు మర్దయ మర్దయ మోహయ హర హర మమరిపూన్ ధ్వంసయ ధ్వంసయ భక్షయ భక్షయ త్రోటయ త్రోటయ యాతుధానికా చాముండా సర్వజనాన్ రాజపురుషాన్ రాజశ్రియం దేహిదేహి నూతనం నూతనం ధాన్యం జక్షయ జక్షయ క్షాం క్షీం క్షూం క్షేం క్షైం క్షౌం స్వాహా ॥**

శ్లో॥ ఇత్యేతత్ కపచం దివ్యం కథితంతవ రావణ
యేపఠంతి సదాభక్త్యా తేషాంనశ్యంతి శత్రవః ।
వైరిణః ప్రళయంయాంతి వ్యాధితాశ్చ భవంతిహి
సహస్రపఠనాత్ సిద్ధిః కవచస్యభవేత్తదా

**ప్రభాత సమయేచైవ పూజాకాలే ప్రయత్నతః**
**సాయంకాలే తథాపాఠాత్ సర్వసిద్ధిర్భవేద్ధృవం**

తా॥ ఓ రావణా! ఈ కవచం దివ్యమైనది. దీనిని భక్తితో పఠించిన శత్రువులు ఋణ-రోగ బాధలు పొందెదరు. 1000సార్లు జపించిన సిద్ధించును. ఉదయ-సాయం సంధ్యలందు జపించినచో సర్వసిద్ధులు కలుగును.

## ద్వితీయ పటలం

**ప్రవాళ వజ్రమణిభిః వశ్యపౌష్టిక యోర్జపేత్**
**మత్తేభ దంతమణిభిః జపేదాకృష్ట కర్మణి ॥**

తా॥ పుష్టి-శాంతికర్మలయందు పగడముల జపమాల, వజ్రమాల ఉపయోగించాలి. ఆకర్షణ కర్మలయందు గజదంతమాల, విద్వేషణ ఉచ్చాటన కర్మలయందు, శత్రుకేశములతో గ్రుచ్చిన అశ్వదంతమాల ఉపయోగించాలి.

**మృతస్య యుద్ధశూన్యస్య దశనైర్గర్దభస్య చ**
**కృత్వాక్షమాలాం జప్తవ్యం శత్రోర్మణమిచ్ఛతా**
**క్రియతే శంఖమాలాభిర్ధర్మ కామార్థ సిద్ధయే**
**పద్మాక్షైః ప్రజపేన్మంత్రం సర్వకామార్థ సిద్ధయే ॥**
**రుద్రాక్షమాలయా జప్తో మంత్రః సర్వఫలప్రదః**
**ఆకృష్ట్యుచ్చాటయోః వాజిపుచ్ఛవాల సముద్భవా ॥**

తా॥ మరణించిన లేదా యుద్ధమృతుని దంతములతో మాల మారణకర్మకు ప్రశస్తం. ధర్మకామార్థ సిద్ధికి శంఖమాల, సర్వకామములకు పద్మమాల (తామర పూసలు) అన్ని సిద్ధులకు "రుద్రాక్షమాల" శ్రేష్ఠము.



స్ఫటిక, ముత్యముల మాల విద్యాభివృద్ధికి, గుర్రంతోకతో గుచ్చిన మాల ఆకర్షణ - ఉచ్చాటనలకు ప్రశస్తము.

**శ్లో॥ నరస్నాయు విశౌధేతు మారణెరజ్జురుత్తమా**
**అన్యాసాం చాక్షమాలానాం రజ్జుః కార్పాసకీమతా**
**సప్తవింశతి సంఖ్యాకైః మాలాసిద్ధిం ప్రయచ్ఛతి**
**అక్షైస్తు పంచదశభిః అభిచార ఫలప్రదా**
**అష్టోత్తరశతేనైవ సర్వకర్మసు పూజితా ।**

తా॥ మారణకర్మలో మానవ నరములతో మాల గ్రుచ్చినచో ప్రశస్తం. ఇతర అభిచార కర్మలలో పత్తిదారం మంచిది. మాలలో పూసలసంఖ్య 27 ఉండవలయును. 50 పూజలు అభిచార కర్మకు ఉపయోగించాలి. 108 పూసలు అన్ని కర్మలకూ ప్రశస్తం.

## జపము చేయు దిశలు

**శ్లో॥ జపేత్ పూర్వముఖం వశ్యేదక్షిణం చాభిచారికే ।**
**పశ్చిమేధనదం విద్యాదుత్తరం శాంతికం భవేత్**
**ఆయుష్యరక్షా శాంతించ పుష్టింవాపి కరిష్యతి ॥**

తా॥ వశీకరణ కర్మలయందు తూర్పుముఖముగా జపం చేయాలి. అభిచార కర్మలలో దక్షిణముఖం, ధనవృద్ధికి పశ్చిమముఖం, ఆయుష్, శాంతికర్మలకు ఉత్తర ముఖంగా జపం చేయాలి.

**శ్లో॥ పరాభిచారే కిలవాచికః స్యాదుపాంశురుక్తో వ్యథ శాంతిపుష్ట్యోః ।**
**మోక్షేసు జాపః కిలమానసాఖ్యః త్రిధాజపః పాపనుదే తథోక్తః ॥**

తా॥ శత్రువుగూర్చి చేయు అభిచార కర్మలలో బిగ్గరగా ఉచ్చరిం చుచూ వాచికజపం చేయాలి. శాంతికర్మలలో ఉపాంశుజపం (ఎవరికీ వినబడక పెదవుల కదలికతో చేసేది) మోక్షప్రాప్తికి మానస జపం చేయాలి.

శ్లో॥ కృష్ణజీరక చూర్ణేన అంజితాక్షీ నపశ్యతి
తక్రేణ క్షాలయేచక్షుః సుస్థోభవతి ఘోటకః ॥

తా॥ నల్లజీలకర్ర చూర్ణము గుర్రంకళ్ళకు కాటుక పెట్టినచో, అది గుడ్డిదగును. మజ్జిగతో కనులు కడిగినచో తిరిగి కనబడును.

## అశ్వమారణం

శ్లో॥ అశ్వాస్థికీలమశ్విన్యాం కుర్యాత్సప్తాంగుళం పునః
నిఖనేదశ్వశాలాయాం మారయ త్యేవఘోటకాన్ ।

తా॥ 7 అంగుళములు కల గుర్రం ఎముకను, అశ్వినీ నక్షత్రం రోజున 108సార్లు ఓం అశ్వం పచపచ స్వాహా" (10వేలు సిద్ధి) జపించి, గుర్రంశాలలో పాతినచో, అవి మృతి చెందగలవు.

## మత్స్యనాశనం

శ్లో॥ సంగ్రాహ్య పూర్వఫల్గున్యాం బదరీకాష్ఠ కీలకం
దాసగృహేఽష్టాంగుళంచ నిఖనేన్మత్స్యనాశకం ॥

తా॥ పుబ్బా నక్షత్రంరోజు రేగుపుల్ల 8 అంగుళములు తీసుకొని – ఓం జలే పంచపచ స్వాహా (10వేలు సిద్ధి) మంత్రముతో 108సార్లు మంత్రించి, జాలరి ఇంట్లో పాతినచో మత్స్యనాశనమగును.

## వస్త్రనాశనం

శ్లో॥ గృహీత్వా పూర్వఫల్గున్యాం జాతీకాష్ఠస్య కీలకం
అష్టాంగుళ ప్రమాణంతు నిఖవ్యాద్రజకే గృహే ॥

తా॥ పుబ్బా నక్షత్రంరోజున 8 అంగుళముల జాజిపుల్ల "ఓం కుంభం స్వాహా" అను మంత్రముతో 108సార్లు మంత్రించి రజకుని ఇంట్లో పాతినచో వస్త్రనాశనం.



## తైల నాశనం

శ్లో॥ మధుకాష్ఠస్య కీలంతు చిత్రాయాం చతురంగుళం
నిఖనేత్తైలశాలాయాం తైలంతత్రవినశ్యతి ॥

తా॥ చిత్తా నక్షత్రంరోజున 4 అంగుళముల ఇప్పపుల్ల ఓం దహదహ స్వాహా। (వెయ్యి జపసిద్ధి) అను మంత్రముతో 108సార్లు అభిమంత్రించి, నూనె ఉన్నచోట పాతినచో తైల నాశనమగును.

## కూరలు ఎండిపోవుటకు

శ్లో॥ గంధకం చూర్ణితం తత్ర నిక్షేపేజ్జల మిశ్రితం
నశ్యంతి సర్వశాకాని శేషాణ్యల్ప బలానిచ ॥

తా॥గంధకపొడి నీళ్ళలోకలిపి, కూరలతోటయందు జల్లినచో, మొక్కలు ఎండిపోవును. ఇది మంత్రం లేని తంత్రం.

## క్షీరనాశం

శ్లో॥ నిక్షిపే దనురాధాయాం జంబూకాష్ఠస్య కీలకం
అష్టాంగుళం గోపగేహే గోదుగ్ధం పరినశ్యతి ॥

తా॥ అనూరాధా నక్షత్రంరోజున 8 అంగుళముల నేరేడుపుల్ల పాడియున్న చోట పాతిన క్షీరనాశనం.

## మద్యనాశం

శ్లో॥ షోడశాంగుళకం కీలం కృత్తికాయాం సితార్కజం
శౌండికస్య గృహేక్షిప్తం మదిరాం నాశయత్యలం ॥

తా॥ కృత్తికా నక్షత్రంరోజున 16 అంగుళముల తెల్లజిల్లేడు కర్రతెచ్చి మద్యపానస్థలంలో ఉంచిన, అతడు నష్టము పొందును.

## తృతీయ పటలం

శ్లో॥ అథాగ్రే కథయిష్యామి ప్రయోగం మోహనాభిదం
సద్యఃసిద్ధికరం న్రూణాం శృణు రావణ యత్నతః ॥
సింధూరం కుంకుమంచైవ గోరోచన సమన్వితం
శ్లో॥ ధాత్రీరసేన సంపిష్వా తిలకంలోక మోహనం ॥
సహదేవ్యా రసేనైవ తులసీబీజ చూర్ణకం
రవౌయస్తిలకం కుర్యాత్ మోహయేత్ సకలంజగత్
మనశ్శిలాంచ కర్పూరం పేషయేత్కదలీరసైః
హరితాళం చాశ్వగంధాం పేషయేత్కదలీరసైః
గోరోచనేన సంయుక్తం తిలకంలోక మోహనం ॥

తా॥ రావణా! వెంటనే సిద్ధించు మోహన ప్రయోగములను విను. 1) సింధూరం, కుంకుమ, గోరోచనం వీటిని ఉసిరాకు రసముతో మర్దించి తిలకం ధరించిన లోకమంతా మోహనమగును. 2) తులసీబీజములు, సహదేవీ రసముతో మర్దించి ఆదివారం తిలకం ధరించిన లోకమోహనం. 3) మనశ్శిల, కర్పూరం, అరటిరసంతో మర్దించి తిలకం ధరించవచ్చు. 4) హరితాళం, అశ్వగంధ (పెన్నేరు). గోరోచనంతో ధరిస్తే లోకమోహనం.

శ్లో॥ తాంబూలమూల తిలకం లోకమోహనం కారకం
సిందూరంచ వచాశ్వేతం తాంబూల రసపేషితం ॥
అపామార్గో భృంగరాజో లాజాచ సహదేవికా
ఏభిస్తు తిలకంకృత్వా త్రైలోక్యం మోహయేన్నరః
శ్వేతదూర్వా గృహీత్వాతుహర తాళంచపేషయేత్
బిల్వపత్రం గృహీత్వాతు ఛాయాశుష్కంతు కారయేత్
కపిలా పయసాయుక్తం పటీంకృత్వాతు గోలకం



తా. ఓం ఉడ్డామరేశ్వరాయ సర్వజగన్మోహనాయ అం ఆం ఇం ఈం ఉం ఊం ఋం ౠం ఫట్ స్వాహా.

ఈ మంత్రం 1లక్ష జపిస్తే సిద్ధిస్తుంది. అనంతరం తాంబూల తీగవేరు మంత్రించి దాని గంధం ధరిస్తే లోకమోహనం 6) సింధూరం, వచ తమలపాకు రసంతో మర్ధించి తిలకం ధరించాలి 7) తెల్లగరిక, హరితాళంతో మర్దించి తిలకం ధరించాలి. 8) మారేడు దళములు నీడలో ఎండించి, కపిలగోవు పాలతో నూరి ఉండచేసి దానిని తిలకంగా ధరిస్తే లోకమోహనం. మోహన మంత్రం ముందుగా సిద్ధించాలి.

## చతుర్థ పటలం

శ్లో॥ తత్రాదౌ కథయిష్యామి జలస్తంభనముత్తమం
కుళీరనేత్ర దంష్ట్రాశ్చ రుధిరం మాంసమేవచ ॥
హృదయం కచ్ఛపస్యైవ శిశుమారవసా తతః
విభీతకస్యతైలేన సర్వాణ్యేకత్ర సిద్ధయేత్ ।
ఏభిః ప్రలేపనం కుర్యాజ్జ లేతిష్టే ద్యథాసుఖం
ఉరగస్యవసాగ్రాహ్యా నక్రస్యన కులస్య చ
ఉండుభస్య శిరోగ్రాహ్యం సర్వాణ్యేకత్ర కారయేత్ ॥
తైలం పక్వాయసేపాత్రౌ కృష్ణాష్టమ్యాం సమాహితః
శంకరస్యార్చనంకృత్వా మూర్ధ్నికృత్వా ప్రదక్షిణాం
అష్టాధిక సహస్రేణ చాజ్యహోమం తతశ్చరేత్
లేపంకృత్వాథ మంత్రేణ తతః సిద్ధింప్రజాయతే

తా॥ రావణ! ముందుగా జలస్థంభన ప్రయోగము విను. తేలుకన్ను, పన్ను, రక్తం. తాబేలుయొక్క గుండెయొక్క వస, జీడినూనెతో వండాలి, దానిని శరీరమునకు పూసుకొని, జలముపై కూర్చొనవచ్చు.

పాము-మొసలి-ముంగిస వీటియొక్క వస, కొండచిలువ శిరస్సు వీటిని జీడితైలంతోవండి ఒక ఇనుప పాత్రలో ఉంచాలి. తరువాత బహుళ అష్టమిరోజున "శివపూజ"చేసి, స్తంభన మంత్రం 1008సార్లు ఆజ్య హోమం చేసి, ఆనూని శరీరమునకు రాసుకొని జలప్రవేశము చేసిన జలస్తంభనమగును. జల స్తంభనమంత్రం ఓం నమో భగవతే జలం స్తంభయ స్తంభయ హుం ఫట్ స్వాహా ॥ దీనిని 1 లక్ష జపించిన సిద్ధించును.

## అగ్నిస్తంభన

శ్లో॥ మండూకస్య వసాగ్రాహ్యా కర్పూరేణైవ సంయుతా
లేపమాత్రాత్ శరీరాణాయగ్ని స్తంభం ప్రజాయతే ॥

తా॥ కప్పవస కర్పూరముతో కలిపి శరీరమునకు రాసుకొనిన అగ్ని దహించదు.

శ్లో॥ కుమారీ రసలేపేన కించిత్ వస్తున దహ్యతే
అగ్ని స్తంభన యాగోయం నాన్యథా మమథాషితం ॥

తా॥ ఉలిమిరి రసలేపమువల్ల ఏ వస్తువూ అగ్నిదాహము పొందదు. ఇది ఒక విధమైన అగ్నిస్తంభన యోగం.

## ఆసన స్తంభన

శ్లో॥ శ్వేత గుంజాఫలం క్షిప్త్వా నృకృపాలేతు మృత్తికాం
బలిందత్వాతు దుగ్ధస్య తస్యవృక్షో భవేద్యధా ॥
తస్యశాఖా లతాగ్రాహ్యా యస్యాగ్రే తాంవినిక్షిపేత్
తస్యస్థానే భవేత్ స్తంభః సిద్ధయోగ ఉదాహృతః

తా॥ ఓం నమో దిగంబరాయ అముకస్య ఆసనస్తంభనం కురుకురు స్వాహా॥ ఇది 10వేలు జపిస్తే సిద్ధిస్తుంది. అనంతరం 1 వెయ్యి జపించాలి.



మానవ కపాలంలో మట్టివేసి తెల్లగురివింద విత్తనం వేసి రోజూ ఆవుపాలుపోసి మొక్కగా పెంచాలి. అనంతరం దాని తీగగాని, రెమ్మగాని, ఎవరిముందు పడవేస్తే వారికి ఆసన స్తంభన జరిగి ఎక్కడికీ కలదలలేరు. ఇది సిద్ధయోగం.

## బుద్ధిస్తంభన

శ్లో॥ ఉలూకస్య కపేర్వాపి తాంబూలేయస్యదాపయేత్
విష్టాం ప్రయత్నస్తస్య బుద్ధి స్తంభః ప్రజాయతే ।
పుష్యార్కేహ్నిం సమాదాయ ఖరమంజరి మూలకం
పిష్ట్వాలిపేచ్ఛరీరేషు శస్త్రస్తంభః ప్రజాయతే ॥
ఖర్జూరీ ముఖమధ్యస్థా కటిబద్ధాచ కేతకీ
భుజదండ స్థి తేచార్కే సర్వశస్త్ర నివారణం ॥
గృహీత్వా రవివారేతు బిల్వపత్రంచ కోమలం
లేపనం శస్త్రస్తంభంస్యాత్ పిష్ట్వాని శిసమంతథా ॥

తా॥ గుడ్లగూబ లేదా కోతియొక్క మలం, తాంబూలంలో కలిపి ఇచ్చినచో దానిని సేవించినవ్యక్తికి బుద్ధిస్తంభమగును. పుష్యార్క యోగంలో ఖరమంజరి (గాడిదగడపాకు) వేరు తెచ్చి దానిని మర్దించి శరీరమునకు రాసుకొనిన శస్త్రస్తంభన జరుగును. ఖర్జూరం నోటిలోను, మొగలిరేకు మొలకు, భుజమునకు జిల్లేడువేరు ధరించిన శస్త్రస్తంభన అగును.

ఓం నమో అఘోరరూపాయ శస్త్రస్తంభనం కురు కురుస్వాహా ॥ ఈ మంత్రం 10వేలు జపిస్తే సిద్ధి. ఆదివారం లేతమారేడు ఆకులు, లేత తామరతూడులతో మర్దించి లేపనం చేస్తే శస్త్రస్తంభన.

## మేఘ స్తంభన

శ్లో॥ ఇష్టకా ద్వయమాదాయ సంపుటం కారయేన్నరః
చితాంగారేణ సంలేఖ్య భూసంస్థంభన మేఘకం ।

తా॥ రెండు ఇటుకలు కలిపి, చితాభస్మంతో "మేఘ స్తంభనం కురుకురు స్వాహా అను మంత్రమువ్రాసి, భూమిలో పాతినచో మేఘ స్తంభన జరుగును.

## నిద్రా స్తంభన

శ్లో॥ మూలం గ్రహీత్వా మధుకంపిష్ట్వా నశ్యం సమాచరేత్
ఉష్ట్రస్యాస్థి చతుర్ధిక్షు నిఖినే ద్భూతలే ధృవం
గోమహిష్యాదిక స్తంభః సిద్ధయోగ ఉదాహృతః ॥
హరితాళ రసేనైవ రవిపత్రం సమాలిఖేత్
యస్యనామోద్యానమధ్యే ఈశాన్యే స్థాపయేత్తతః ॥
ముఖస్తంభనకంతస్య నాన్యథా మమభాషితం ॥

తా॥ మధుకవేరు గ్రహించి పొడిగాచేసి నశ్యంగా పీల్చినచో నిద్రా స్తంభన జరుగును. బృహతీవేరు తేనెలో మర్ధించి కనులకు కాటుక పెట్టినచో నిద్రాస్తంభన. ఒంటె ఎముకలు 4 దిక్కులా పాతినచో గో-మహిషస్తంభన జరుగును. జిల్లేడు ఆకుమీద హరితాళ రసంతోశత్రునామం వ్రాసి తోటలో ఈశాన్య భాగంలో పాతినచో ముఖస్తంభన జరుగును.

# పంచమ పటలం

## విద్వేషణ ప్రయోగం

శివఉవాచ -

శ్లో॥ గజదంతం గృహీత్వాచ సింహదంతంతథై వచ
పేషయేన్నవనీతేన తిలకం ద్వేషకారకం ।



ఏకహస్తేకాక పక్షములూకస్య కరేపరే
మంత్రయిత్వా మేలయిత్వా కృష్ణసూత్రేణ వేష్టయేత్ ॥
అంజలేచ జలేచైవ తర్పయేత్ హస్తపక్షకః
ఏవం సప్తదినం కుర్యాదష్టోత్తర శతంజేపత్ ॥
గృహీత్వా గజకేశంచ సింహకేశం తథైవ చ
గృహీత్వా పాదపాంశుంచ పుత్తలీం నిఖనేద్భువి
అగ్నిస్తస్యో పరిస్థాప్యః మాలతీ కుసుమం హునేత్
విద్వేషం కురు తేనూనం నాన్యధాచ మయోదితం ॥

తా॥ ఏనుగు - సింహం వీటి దంతములు వెన్నతో మర్ధించి తిలకం ధరిస్తే విద్వేషం కలిగిస్తుంది. ఒక చేతితో కాకి ఈక, మరొకచేత్తో గుడ్లగూబఈక మంత్రించి నల్లదారంతో కట్టి నీటిలో నిలబడి విద్వేషణ మంత్రంతో 108సార్లు తర్పణం 7రోజులు జేసిన శత్రువులకు విద్వేషణం కలుగును. ఏనుగు-సింహం వీటి వెంట్రుకలు, శత్రుపాదధూళి కలిపి మట్టిబొమ్మచేసి భూమిలోపాతి పైన అగ్ని స్థాపించి మాలతీ పూలతో హోమం చేసిన విద్వేషణ సిద్ధించును.

శ్లో॥ బ్రహ్మదండి సమూలంచ కాకజంఘా సమన్వితా
జాతీపుష్ప రసైర్భావ్యా సప్తరాత్రం పునః పునః ।
తతోమార్జార మూత్రేణ సప్తాహం భావయేత్పునః
ఏషధూపః ప్రదాతవ్యో శతృగోత్రస్య మధ్యతః ॥
యధాగంధం సమాఘ్రాతి తధాసర్వైః సమంకలిః
తతో విద్వేషణం యాతి సుహృద్భిర్బాంధవైస్సహ
గృహీత్వా మహిషీ కేశం చాశ్వకేశేన పేషయేత్
సభాయాం దీయతే ధూపః విద్వేషోజాయతే క్షణాత్

తా॥ బ్రహ్మదండివేరు కాకి ఈకతో కలిపి జాజిపూల రసంతో 7 రాత్రులు మర్ధించి శృతృజనమధ్యలో ధూపం వేసినచో వారికి పరస్పర విద్వేషణ కలుగును. గేదె-గుర్రం వెంట్రుకలు కలిపి ధూపం వేసిననూ విద్వేషణ కలుగును.

**మార్జార్యా మూషికాయాశ్చ విష్టామాదాయ యత్నతః**
**జపేన్మంత్ర శతంకుర్యాన్నరపుత్తలి కాంశుభాం**
**నీలవస్త్రేణ సంవేష్ట్య తద్గృ హే నిఖనేద్యది**
**విద్వేషో జాయతే శీఘ్రంబంధూనాంపితృ పుత్రయో ॥**

తా॥ పిల్లి. ఎలుక మలం, శతృపాదధూళితో కలిపి బొమ్మచేసి, నీలిరంగు బట్టచుట్టి, మంత్రశతం జపించి, శతృగృహంలో పాతినచో, వెంటనే బంధువులతో సహా విద్వేషణ కలుగును.

శ్లో॥ **ఏకహస్తేకాక పక్షమూలూకస్య కరేపరే**
**మంత్రయిత్వా మేలయిత్వా కృష్ణసూత్రేణ వేష్టయేత్**
**యద్గృహే నిఖనేద్భూమౌ విద్వేషస్త స్యజాయతే**
**పునశ్చ సస్థీకరణంఘృతగగ్గుల ధూపతః ।**

తా॥ కాకిఈక - గుడ్లగూబఈక కలిపి మంత్రించి నల్లదారం కట్టి, శతృగృహంలో పాతినచో విద్వేషణ కలుగును. గుగ్గిలధూపం వేసిన ఉపసంహార మగును.

## షష్ఠపటలః

## ఉచ్చాటన ప్రయోగం

**శివ ఉవాచ**

శ్లో॥ **యేన హృతం గృహంక్షేత్రం కళత్రం ధనపుత్రకం**
**ఉచ్చాటనం వధంకుర్యాత్ శృణు రావణయత్నతః ॥**



**శ్వేతలాంగలి కామూలం స్థాపయేద్యస్యవేశ్మని**
**నిఖనేత్తు భవేత్తస్య సద్యఉచ్చాటనం ధృవం ॥**
**బ్రహ్మదండి చితాభస్మ శివలింగే ప్రలేపయేత్**
**సిద్ధార్థేన సంయుక్తం శనివారే క్షిపేత్ గృహే**
**ఉచ్చాటనం భవేత్తస్య జాయతే మరణాంతికం ॥**
**వినామంత్రేణ సిద్ధిశ్చ సిద్ధియోగ ఉదాహృతః ॥**

తా॥ తనయొక్క గృహం - క్షేత్రం - ధనం - కళత్రం హరించిన శత్రువులపై ఉచ్చాటన ప్రయోగించాలి. తెల్లతరిగొర్ర వేరు శతృగృహంలో పాతినచో అతడు ఊరు వదలిపోవును. బ్రహ్మదండి - చితాభస్మం - ఆకుపచ్చ ఆవాలు శివలింగానికి లేపము చేసి అది శనివారంనాడు శతృగృహంలో వేసినచో ఉచ్చాటన కలుగును. ఇది మంత్రములేని సిద్ధయోగం.

శ్లో॥ **గృహీత్వోదుంబరం కీలంమంత్రేణచతురంగళం**
**నిఖనేద్యస్య శయనే తస్యోచ్చాటనకం భవేత్ ॥**
**కాకోలూకస్య పక్షాణి యద్గృహే నిఖనేద్రవౌ**
**యన్నామ్నా మంత్రయోగేన సమస్తోచాటనంభవేత్**
**నరాస్థి కీలకంభౌమే నిఖనేచ్చతురంగుళం**
**తత్రసూత్రం స్వయం కుర్యాత్తస్యోచ్చాటనకంధృవం**
**సిద్ధార్థం శివనిర్మాల్యం నిఖనేద్యో గృహేజలం**
**ఉచ్చాటనం భవేత్తస్య ఉద్ధృతేచ పునస్సుఖీ ॥**

తా॥ 4 అంగుళముల మేడికర్ర సమంత్రకంగా శతృశయన గృహంలో పాతినచో అతనికి ఉచ్చాటన మగును. ఆదివారంనాడు కాకి-గుడ్లగూబ ఈకలు శతృగృహంలో మంత్రించి పాతినచో ఉచ్చాటన అగును. మంగళవారంనాడు 4 అంగుళముల నరుని వెన్నెముక

అభిమంత్రించి సూత్రంకట్టి శతృగృహంలో పాతిన ఉచ్చాటనమగును. శివనిర్మాల్య జలంతో తెల్లఆవాలు కలిపి శతృగృహంలో పాతిన ఉచ్చాటన అగును. తీసి వేసినచో స్వస్థుడగును.

**శ్లో॥ మధ్యాహ్నేలుంఠతే భూమౌ గర్ధభోయత్రధూళికాం**
**ఉదంగ్ముఖః ప్రతీచ్యాంతు గృహీత్వావామపాణినా**
**యద్గృహే క్షిప్య తేధూళి తస్యోచ్చాటనకం భవేత్ ॥**

తా॥ మధ్యాహ్న కాలమందు ధూళిలో దొర్లుతున్న గాడిద శరీరంకింది మట్టిగ్రహించి, ఎడమచేత్తో ఉత్తరముఖంగా శతృగృహంలో జల్లినచో ఉచ్చాటన జరుగును. ఈ విధంగా 7 రోజులు చేయాలి.

శతృ ఉచ్చాటన మంత్రం – ఓం నమో భీమాస్యాయ అముకగృహే ఉచ్చాటనం కురు కురు స్వాహా ॥

## సప్తమ పటలం

## వశీకరణ ప్రయోగం

**ఈశ్వర ఉవాచ :-**

**శ్లో॥ అథాగ్రే కథయిష్యామి వశీకరణ ముత్తమం**
**రాజాప్రజా పశూనాంచ శృణు రావణ యత్నతః ॥**
**ప్రియంగు తగరంకుష్ఠం చందనం నాగకేశరం**
**ధత్తూరస్య పంచాంగం సమభాగం తుకారయేత్ ॥**
**ఛాయాయాంవటికా కార్యాప్రదేయా ఖాద్యపానయోః**
**పురుషోనాథ నారీచ యావజ్జీవం వశంనయేత్**
**సప్తాహం మంత్రితంకృత్వా మంత్రేణానేన మంత్రవిత్ ॥**
**ఏకచిత్తస్థితో మంత్రీ జపేన్మంత్ర మతంద్రితః**
**త్రింశత్ సహస్ర సంఖ్యాకం సర్వలోక వశంకరం ।**



తా॥ రాజ– ప్రజా– స్త్రీవశీకరణ విధానములు చెబుతాను విను. ప్రియంగు (ప్రేంకణం) తగరం – కుష్ఠం – చందనం – నాగకేసరం, ఉమ్మెత్త పంచాంగములు (బెరడు – వేరు – కాడ – ఆకు – పువ్వు) సమభాగములు గ్రహించి, నీడలో ఎండబెట్టి గుటికగాచేసి, తాంబూలమందుగాని, తినుబండారములో గాని పెట్టి తినిపించినచో యావజ్జీవము వశులగుదురు ఇది 7 రోజులు చేయాలి.

**మంత్రం - ఓం నమో భగవతే ఉడ్డామరేశ్వరాయ**
**మోహయ మోహయ మిలి మిలిఠఃఠః స్వాహా ॥**

ఈ మంత్రం 30వేలు జపిస్తే సిద్ధించును.

**శ్లో॥ బిల్వపత్రాణి సంగృహ్య మాతులుంగం తథైవచ**
**అజాదుగ్ధేన సంపిష్ట్వా తిలకం లోకవశ్యకృత్ ।**
**కుమారీ కందమాదాయ విజయాబీజ సంయుతం**
**మస్తకే తిలకం కుర్యాత్ వశీకరణ ముత్తమం**
**గోరోచనం వంశనేత్రం మత్స్యపిత్తంచ కుంకుమం**
**చందనం కాకజంఘాచ మూలంభాగసమం నయేత్**
**వాప్యాదిక జలేనైవ వేషయిత్వా కుమారికా**
**హస్తేన గుటికాంకృత్వా ఛాయాయాంచ విశోషయేత్**
**లలాటే తిలకం కుర్యాత్ యః పశ్యతి సవశీభవేత్**
**రాజద్వారే న్యాయయుద్ధే సర్వత్ర విజయీభవేత్ ।**

తా॥ మారేడాకులు, మాదీఫలం మేకపాలతో మర్ధించి తిలకంగా ధరిస్తే లోకవశీకరణం, ఉలిమిరిచెట్టు దుంపగంజాయి విత్తనములతో నూరి తిలకంగా ధరిస్తే జనవశీకరణం. గోరోచనం– వెదురుగుజ్జు, చేపపిత్తాశయము – కుంకుమ – చందనం కాకజంఘ సమంగా గ్రహించి – నూతినీటితో నూరి కన్య చేతితో గుటిక చేయించి నీడలో ఎండబెట్టి

– దాని గంధం తిలకంగా ధరిస్తే సర్వవశీకరణం – ఉన్నతాధికారుల వద్ద – న్యాయయుద్ధమందు జయము లభించును.

**కుంకుమం చందనం చైవ రోచనం శశిమిశ్రితం**
**గవాంక్షీ రేణ తిలకం రాజవశ్యకరం పరం ॥**
**చంపకస్య తు వందాకం కరేబధ్వా ప్రయత్నతః**
**సంగృహ్యాతు భరణ్యర్కే పుష్కార్కేవా విధానతః**
**రాజానాం తక్షణాదేవ మనుష్యా వశమానయేత్ ॥**

తా॥ ఓం హ్రీం సః అముకం మే వశమానయ – ఆనయ స్వాహా” ఇది వశీకరణ మంత్రం. చందనం – కుంకుమ – గోరోచనం – కర్పూరం ఆవులపాలతో నూరి తికలం ధరిస్తే అధికారులు వశమౌతారు. పుష్కార్క యోగంలోగాని భరణి నక్షత్రం ఆదివారంనాడు గాని, సంపెంగ బదనిక, శాస్త్ర ప్రకారం తీసుకువచ్చి చేతికి ధరించిన ఉన్నతాధికారులు వశమగుదురు.

**శ్లో॥ ఉశీరం చందనంచైవ మధునాసహసం యుతం**
**గళహస్తప్రయోగోయం సర్వనారీ ప్రసాధకః ।**
**చితాభస్మం వచాకుష్ఠం కుంకుమంరోచనం సమం**
**చూర్ణం స్త్రీశిరసి క్షిప్తం వశీకరణమద్భుతం ॥**
**కృష్ణోత్పలం మధుకరస్య పక్షయుగ్మం**
**మూలంతథా తగరజంసిత కాకజంఘాం**
**యస్యశిరోగతమిదం విహితం విచూర్ణం**
**దాసీభవే ఝటితి సాతరుణీ విచిత్రం ॥**

తా॥ వట్టివేరు, చందనం – తేనెతోకలిపి, స్త్రీ కంఠానికి పూసినచో ఆ స్త్రీ వశమగును. చితాభస్మం – వచ – కుష్ఠం – కుంకుమ – గోరోచనం సమపాళ్ళలో కలిపి ఆ పొడిని స్త్రీ తలపై చల్లినచో వశమగును.



నల్లకలువ – తుమ్మెద రెక్కలు, తెల్ల కాకజంఘవేరు – తగరం సమపాళ్ళలో చూర్ణంచేసి – స్త్రీ శిరస్సుపై చల్లినచో వెంటనే వశమగును.

**శ్లో॥ నవ్యేన పాణికమలేన రతావసానే**
**యో రేతసా నిజభవేన విలాసినీనాం ।**
**వామం విలిం పతిపదం సహసైవ యస్యా**
**వశ్యేవ సాభవతి నాత్రవికల్పభావః ॥**
**సింధుస్థమాక్షీక కపోతమాలాం చపిష్ట్వా**
**లింగం విలిప్య తరుణీంరమతే నవోఢాం**
**సోన్యం నయాతి పురుషం మనసాపి నూనం**
**దాసీ భవేదితి మనోహర దివ్యమూర్తిః ॥**

తా॥ సురతానంతరం వెంటనే, స్ఖలితమైన వీర్యం కుడిచేత్తో భార్య ఎడమ అరికాలికి భర్త పూసినట్లయితే, ఆమె భర్తకు వశీభూతురాలై అనుకూలంగా యుంటుంది. సైంధవ లవణం – తేనె – పావురాయిమలం కలిపినూరి, పురుషాంగమునకు పూసి నవోఢ అయిన స్త్రీతో రమించినచో ఆ స్త్రీ మరొకని కోరదు. దాసురాలై యుండును.

**గోరోచనా శిశిరదీధితి శంభువీర్యైః ।**
**కాశ్మీర చందనయుతైః కనకద్రవైశ్చ ॥**

తా॥ గోరోచనం – కర్పూరం – పాదరసం – చందనం ఉమ్మెత్తాకు రసంలో నూరి పురుషాంగమునకు లేపనం చేసి రమించిన, ఆమె వశ్యురాలవుతుంది.

**శ్లో॥ సలోధ్ర కాశ్మీర తురంగ గంధా మాతంగ గంధా పరిపాచితేన।**
**తైలేన వృద్ధిం ఖలుయాతి లింగం వరాంగనా లోకమనోహరం తత్ ॥**
**వరాహవసయాలింగం మధునాసహ లేపయేత్**
**స్థూలం దృఢంచ దీర్ఘంచ మాసాత్ లింగం ప్రజాయతే ॥**

అశ్వగంధావరీం కుష్ఠం మాసీం సింహీపలాన్వితం
చతుర్గుణే నదుగ్ధేన తిలతైలం విపాచయేత్
స్తనలింగ కర్ణపాణి వర్ధనం భక్షణాదితః ॥
పిప్పలీ లవణక్షీర సితాలోపేపి దీర్ఘకృత్ ॥

తా॥ లోధ్ర – కేసరం – అశ్వగంధ – గజపిప్పలి, నూనెలో మరగించి – పురుషాంగమునకు మాలిశ్ చేసినచో లావుగా – పొడుగ్గా అగును. పందివస తేనెతో కలిపి 1 నెల లేపనం చేసిన దృఢమగును. అశ్వగంధ – పిల్లపీచర – కుష్ఠం – జటామాంసి – సింహీఫలం వీటికి 4 రెట్లు పాలతో 4రెట్లు నూనెతోవండి భక్షించిన, స్తనములు, మర్మావయవములు వృద్ధి పొందును.

శ్లో॥ ఏరండతైలం బకులస్య తైలం తథాచ బిల్వస్వరసం గృహీత్వా ॥
సమర్ధయేదూర్ధ్వగ హస్తకేన తదాస్తనం నోపతితౌకదాపి
శ్రీ పర్ణీరస కర్మాభ్యాం తైలంసిద్ధ తలోద్భవం ॥

తా॥ ఆముదం నూనె – వకుళతైలం – మారేడురసం కలిపి చేతితో స్తనములను పైకి మర్దించినచో స్తనములు గట్టిగా ఎత్తుగా నుండును. జారిపోవు మారేడురసం – రసకర్పూరం – తిలతైలంలో మరిగించి స్తనములకు మర్దనం చేసిన కాఠిన్యము పొందును.

శ్లో॥ ప్రక్షాలయేత్ నింబకషాయతోయైః
నిశాజ్యకృష్ణాగరు గుగ్గులానాం
ధూపేన యోనిం నిశి ధూపయిత్వా
నారీ ప్రమోదం విదధాతి భర్తుః ॥

తా॥ నిమ్మకషాయముతో స్త్రీయోనిని కడిగి, నల్ల అగరు – గుగ్గిలం ధూపం వేసినచో ఆ స్త్రీ భర్తకు అమిత సుఖముల నిచ్చును.



## యోని దుర్గంధ నాశనం

శ్లో॥ ప్రక్షాళ్య నింబస్య జలేన భూయః
తస్యైవ కల్కేన విలేపయేచ్చ ॥
తృజేయురత్యాశ్చిర కాద్భుతంచ
గంధం వరాంగస్య నసంశయోత్ర ॥
పలాశభస్మ హింతాళచూర్ణే రంభాంబుమిశ్రైరుపలిప్య
భూయః ॥ కందర్పగేహే మృగలోచనీనాం రోమాణిరోహంతి
కదాపినైవ ॥ ఏకః ప్రదేయో హరతాళభాగః పంచప్రదేయో
జలజ్వభాగాః సస్వస్తరో భస్మన ఏవ పంచప్రోక్తశ్చ భాగః
కదళీజలార్ద్రః ।

తా॥ నిమ్మనీటితో యోనినికడిగి, నిమ్మకల్కం యోనికి పూసినచో యోని దుర్గంధము పోవును. మోదుగ ఆకులభస్మం, హరితాళ చూర్ణం, అరటినీటితో నూరి, యోని స్థానముపై పూసినచో అచ్చటి రోమములన్నియూ పోవును. తిరిగి ఉద్భవించవు. 1వంతు హరితాళ భస్మం, 5భాగములు శంఖభస్మం, 5 భాగములు అశ్వగంధ భస్మం అరటి జలంలో కలిపి యోనిస్థానముపై పూసినచో రోమము లన్నియు రాలిపోవును.

## యోని సంకోచనం

శ్లో॥ నిశాద్వయం పంకజకేసరంచ నిష్పీద్యదేవ ద్రుమతుల్యభాగం ॥
అనేనలిప్తం మదనాతపత్రం ప్రయాతి సంకోచ ఫలంయువత్యాః ॥
ఇందీరవ్యాఘ్రీవ చోషణానాం పురంగ మారాసన యామినీనాం ॥
సంకోచయత్యాశు హరేన రంధ్రం॥

తా॥ రెండు రకముల పసుపు, కమల కేసరములు, దేవదారు పుల్లలు, సమభాగములుగా నీటితో నూరి, యోని లేపనంచేస్తే యోని సంకో చించును. నల్లకలువ విత్తనములు, వచ, కచ్చోరం, నల్లమిరియాలు, గన్నేరుపట్ట, పసుపు సమంగా గ్రహించి నీటితో నూరి యోని లేపనం చేసిన బిగుతుగా అగును.

## ద్రావణం

శ్లో॥ సింధూర చించాఫల మాక్షికాని
తుల్యానియస్యా మదనాతపత్రే ॥
ప్రలిప్యయస్యాః పురుష ప్రసంగాత్
ప్రాగేవ వీర్యం చ్యుతిమాతనోతి ॥
వ్యోషం రజః క్షౌద్రసమన్వితంవా
క్షిప్తం యదిస్యాత్ స్మరయంత్రగేహే ॥
ద్రుతంభవేత్ సాసహసైవ నారీ
దృష్టః సదాయం కిల యోగ రాజః ॥
పిప్పలీ చందనంచైవ బృహతీ పక్వతింత్రిణి
ఏషాంలింగే ప్రలేపన ద్రవేన్నారీనసంశయః ॥
అగస్త్యపత్రద్రవ సంయుతేన మధ్వాజ్య సంమిశ్రితటంకణేన ।
లిప్తాధ్వజం యోరమతేంగ నానాం సశుక్ర మాకర్షతి శీఘ్రమేవ॥

తా॥ ద్రావణ మంత్రం-ఓం నమో భగవతే రుద్రాయ ఉడ్డామరేశ్వరాయ స్త్రీణాం మదంద్రాపయ ద్రావయ ఠఃఠః స్వాహా ॥ ఈ మంత్రం 108 సార్లు చేస్తే సిద్ధి. సింధూరం - చింతపండు - తేనెతో నూరి యోని ద్వారమువద్ద రాసి రతిక్రీడ గావించిన స్త్రీకి శీఘ్రముగా ద్రవించును. త్రిఫలా చూర్ణము. తేనెతో కలిపి యోనిలేపనం చేసిననూ ద్రవించును. పిప్పళ్ళు - చందనం చింతపండు నూరి



పురుషాంగమునకు లేపనం చేసి స్త్రీతో రమించిన స్త్రీకి శీఘ్రద్రావణ మగును. అగస్తి ఆకురసము, టంకణభస్మం తేనెలో నేతితో కలిపి, లింగమునకు పూసి మైధునము చేసిన స్త్రీకి శీఘ్రస్ఖలనమగును.

## యక్షిణీ సాధన

శ్లో॥ సర్వాసాం యక్షిణీనాంతు ధ్యానంకుర్యాత్సమాహితః ॥
భగినీమాతృపుత్రీ స్త్రీరూపం తుల్యం యధేప్సితమ్ ।
భోజ్యం నిరామిషంచాన్న వర్జ్యంతాంబూల భక్షణం
ఉపవిశ్య జపాదౌచ ప్రాతఃస్నాత్వానకం స్పృశేత్ ॥
నిత్యకృత్యం చకృత్వాతు స్థానే నిర్జనకే జపేత్
యావత్ ప్రత్యక్షతాం యాంతియక్షిణ్యో వాంఛిత ప్రదాః

తా॥ యక్షిణి సాధనలో ఏకాగ్రతగల మనసుతో ధ్యానం చేయాలి. తల్లి, సోదరి, కుమార్తె, స్త్రీరూపంగా, తనకు నచ్చిన రీతిలో భావించవచ్చు. సాధకుడు మాంసాహారం ముట్టరాదు. తాంబూల వేసుకొనరాదు. ప్రాతః కాలంలో నిత్య కృత్యములు తీర్చుకొని స్నానానంతరం ఎవరినీ తాకరాదు. నిర్జనప్రదేశంలో జపం చేయాలి. యక్షిణులు ప్రత్యక్షంగానే వరము లిచ్చెదరు.

మహాయక్షిణీ మంత్రం - ఓం క్లీం క్లీం హ్రీం ఐం ఓం శ్రీం మహాయక్షిణ్యై సర్వైశ్వర్య ప్రదాత్ర్యై నమః ఈ మంత్రం జితేంద్రియుడై మారేడుచెట్టుమీద కూర్చొని 1 నెలరోజులు రోజూ వెయ్యిసార్లు జపం చేయాలి. శుద్ధబలి ఇవ్వాలి. యక్షిణి అనేకరూపములు ధరించి, సాధకునివద్దకు వచ్చును. చూచి భయము చెందరాదు. ధనం వశీకరణం, ఆభరణములు కోరినవి ఇచ్చును.

శ్లో॥ ఆసక్తస్తుద్విజైః కుర్యాత్ప్రయోగం సురపూజితం
సహాయానథవాగృహ్య బ్రాహ్మణాన్ సాథయేత్ వ్రతం ॥
త్రయః కుమారికాః భోజ్యాః పరమాన్నేన నిత్యశః
సిద్ధేధనాదికే చైవ సదాసత్కర్మ ఆచరేత్
కుకర్మణి వ్యయ శ్చేత్ స్యాత్ సిద్ధిర్గచ్ఛతిచాన్యథా ॥

తా॥ సవ్యమార్గములో కూడా యక్షిణి సాధన చేయవచ్చు. దేవతలను పూజించి బ్రాహ్మణులు సహాయముతో దీక్షవహించి రోజూ 3 కన్యలకు పరమాన్నంతో భోజనం పెట్టి సాధన చేయాలి. మంత్రం సిద్ధించగానే ధనలబ్ధి, వృద్ధి కలుగుతాయి. దానిని సత్కర్మలకు వినియోగించాలి, పాపకర్మలకు ఖర్చు చేసినచో సిద్ధి పాడగును.

**2) ధనదాయక్షిణి మంత్రం -**
**ఓం ఐం హ్రీం శ్రీం ధనం మమ దేహిదేహి స్వాహా ॥**

ఈ మంత్రం రావిచెట్టు నధిరోహించి ఏకాగ్రమనస్కుడై జపించాలి.

**3) పుత్రప్రద యక్షిణీ మంత్రం -**
**ఓం హ్రీం హ్రీం హ్రూం రం కురు కురు స్వాహా ॥**

ఇది మామిడిచెట్టు నధిరోహించి జపించాలి.

**4) ధనప్రద యక్షిణీ మంత్రం -**
**ఓం హ్రీం క్లీం మహా లక్ష్మై నమః ।**

ఇది మర్రిచెట్టు నధిరోహించి జపించాలి.

**5) జయ యక్షిణీ మంత్రం -**
**ఓం ఐం జయాయక్షిణ్యై సర్వకార్య సాధనం కురుకురు స్వాహా.**

ఇది జిల్లేడు నధిరోహించి జపించాలి.



## భూతినీ సాధన

శ్లో॥ సాభూతినీ కుండల ధారిణీచ
సింధూరిణి చాప్యథ హారిణీచ
నటీతథా చాతినటీ చ చేటీ
కామేశ్వరీ చాపికుమారికా చ ॥

తా॥ భూతినీ అనే యక్షిణి కుండలములు ధరించినొసట సింధూరము ధరించి యుండును. నటివలె, యౌవనవతివలె, కుమారిక వలె రూపధారణ చేయును. ఓం హ్రాం క్రూం క్రూం క్రం కటుకటు అముకీదేవీ వరదాసిద్ధిదాచఅం భః ॥ ఇది సంపెంగ చెట్టుక్రింద 8వేలు జపించాలి. పూజానంతరం గుగ్గిల ధూపం వేయాలి.

**4) ధనప్రద యక్షిణీ మంత్రం - ఓం హ్రీం క్లీం మహా లక్ష్మై నమః ।**

ఇది మర్రిచెట్టు నధిరోహించి జపించాలి.

5) జయ యక్షిణి మంత్రం – ఓం ఐం జయాయక్షిణ్యై సర్వకార్య సాధనం కురుకురు స్వాహా, ఇది జిల్లేడు నధిరోహించి జపించాలి.

## శవసాధన

శ్లో॥ శ్మశానాలయ మాగత్య ఉపవాసో జితేంద్రియః
అమాయాం భౌమవారేచ శవోపరి సమారుహేత్ ।
అయుతం ప్రజపేన్మంత్రం మౌనీ నిర్భయరూపతః
శవసాధన మేతత్తు సిధ్యత్యత్ర నసంశయః ॥

## పాదుకా సిద్ధి

శ్లో॥ కాకాజంఘా సితా(గాహ్యా గృ(ధస్యచ వసాతథా
అశ్వగంధా సమాయుక్తా హ్యుష్ట్రిక్షీ రేచపేషయేత్
అనేన లిప్తపాదేతు యోజనానాం తిధిర్వ్రజేత్ ॥

తా॥ తెల్ల కాకజంఘ, ((గద్దవస, అశ్వగంధ ఈ మూడు సమాన భాగములుగా తీసుకొని ఒంటెపాలతో పూరి అరికాలికి (వ్రాసుకొని సుమారు 76-100 కిలోమీటర్లు దూరం నడవగలడు. పాదుకాసిద్ధి మం(త్రం - ఓం నమో భగవతే రు(ద్రాయ భూతభేతాళ (త్రాసనాయ శంఖచ(క గదాధరాయ హన హన మహతే చం(ద్రాయుతాయ హుంఫట్ స్వాహా ॥

## విద్యాధరసిద్ధి

ఓం (హ్రీం గౌర్గోపతయే నమః । పవి(త్రముగా ఈ మం(త్రం రోజూ అర్ధరా(త్రియందు 3వేలు జపించిన సిద్ధించును. జ్ఞానము, సత్సంతానము కలుగును.

## ఇంద్రజాల సిద్ధి

భూతము వదిలించు మం(త్రం - ఓం నమో భగవతే ఉడ్డామరేశ్వ రాయ కుహునీ కుర్భలీ స్వాహా ॥ ఇది 108 సార్లు పఠించుచూ వట్టివేరు - చందనం, కచ్చోరం కలిపి లేపమును శరీరమునకు పూసినచో భూతము వదలును.

శ్లో॥ గుగ్గిలం లశునంసర్పిః కంచుకం కపిరోమచ
శిఖికుక్కుట యోర్విష్ఠామలః పారావతస్యచ



ఏతద్దూపాద్గ్రహాః (క్రూరాః పిశాచాభూత పూతనాః
ఢాకిన్యైహిక జ్వరాశ్చరౌ(ద్రా నశ్యంతిసర్వతః ॥

తా॥ గుగ్గిలం, వెల్లుల్లి, నెయ్యి, పాముకుబుసం, కోతి రోమము, నెమలి-కోడి, పావురాయి మలములు కలిపి ధూపం వేసినచో (గహబాధలు, పిశాచములు, ఐహిక జ్వరములు (ప్రయోగములు నశించును.

H మారణ (ప్రయోగములు, (వ్రాయుటలేదు.

## ఈగల నివారణ

శ్లో॥ త(క్రపిష్టేన తాలేన లేపయేత్ పు(త్రికాకృతిం
తామాదాయ గృహాద్యాతిమక్షికా నా(త్రసంశయః ॥

తా॥ మజ్జిగలో హరితాళంనూరి, ఏదైనా ఒక బొమ్మకు పూసినచో ఈగలు దూరముగా పోవును.

## ఎలుకల నివారణ

శ్లో॥ శ్వేతార్క దుగ్ధం కుల్థాశ్చ తిలచూర్ణం తథైవచ ।
అర్కప(త్రేతు న్యస్తాని మూషకాంత కరాణివై ॥

తా॥ ఉలవలు, నువ్వులపొడి, తెల్లజిల్లేడు పాలతో కలిపి, జిల్లేడు ఆకుపై ఉంచినచో, అది తిని ఎలుకలు నశించును.

## నల్లి నివారణ

శ్లో॥ అర్కతూల మయీవర్తి భావయేత్ యావ కేనచ
దీపం తత్కటు తై లేన నిఃకౌషాయాంతిమత్కుణాః ॥

తా॥ జిల్లేడు వత్తులు, యావక రసంలో నాబెట్టి ఆవనూనెలో దీపం వెలిగించిన నల్లులు పోవును.

## సర్ప - వృశ్చిక నివారణ

శ్లో॥ గుడశ్రీవాస భల్లాతం విడంగ త్రిఫలాయుతం ।
లాక్షార్కపుష్ప ప్రయుతశ్చధూపోవృశ్చికసర్పహృత్ ॥

తా॥ బెల్లం–చందనం–జీడి–వాయువిడంగం–త్రిఫలములు. లాక్ష – జిల్లేడుపూలు కలిపి ధూపం వేసినచో, పాములు, తేళ్ళు పారిపోవును.

## దోమల నివారణ

శ్లో॥ భల్లాతక విడంగాని విశ్వకం పుష్కరం తథా ।
జంబులోమశకం హంతి ధూపాద్వాగృహా మధ్యతః ॥

తా॥ జీడి–వాయువిడంగం, సొంఠి–సమభాగములు గ్రహించి చూర్ణం చేసి ధూపం వేసినచో దోమలు పారిపోవును.

## ధాన్య వృద్ధి

శ్లో॥ పూర్వాషాఢాఖ్య ఋక్షేతు వందాం భీతకవృక్షజాం ।
సస్యమధ్యే క్షిపేత్తేన సస్యవృద్ధిర్భ వేద్ధ్రువం ॥

తా॥ ఓం నమో సురేభ్యః జలజః ఉపరి పరిమిలి స్వాహా ॥ ఈ మంత్రం 10 వేలు జపించి, పూర్వాషాఢ నక్షత్రంరోజున జీడిమామిడి బదనిక తెచ్చి మంత్రించి పొలములో పాతినచో ఎక్కువ పంట పండును.

## గర్భధారణ

శ్లో॥ సమూల పత్రాం సర్పాక్షీం రవివారే సముద్ధరేత్
ఏకవర్ణ గవాంక్షీరే కన్యాహస్తేన పేషయేత్ ॥
ఋతుకాలేపిబేద్వంధ్యా బలార్థం తద్దినేదినే ॥

తా॥ సర్పాక్షి మొక్క సమూలంగా, ఆదివారం తెచ్చి ఒకే రంగు ఉన్న ఆవుపాలతో, కన్యచేత నూరించి స్త్రీ ఋతుకాలములో 7 రోజులు తాగించినచో దోషముపోయి గర్భము ధరించును.



## గర్భస్రావ దోషనివారణ

శ్లో॥ కువలయం సతిలం పీత్వాక్షీరేణ మధుసితాయుతం ।
గురుతరదోషైశ్చలితం గర్భం స్థాపయేదాశు ॥

తా॥ కమం వేరు – తిలలు, పాలతో నూరి తేనెవో సేవించి గర్భదోషములు తొలగి గర్భము నిలుచును.

## సుఖప్రసవం

శ్లో॥ శ్వేతం పునర్నవామూలం చూర్ణంయోనౌ ప్రవేశయేత్ ।
క్షణాత్ప్రసూయతేనారీ గర్భేణాతిప్రపీడితా ॥

తా॥ ప్రసవవేదన పొందు స్త్రీయోనిలో, తెల్లగలిజేరు వేరు చూర్ణమును రాసినచో, వేదనతగ్గి వెంటనే సుఖప్రసవమగును.

ఏతత్తేకధితం వత్స మంత్రముడ్డీశ ముత్తమం
యస్మైకస్మై నదాతవ్యం రక్షణీయం ప్రయత్నతః ॥

తా॥ ఓ రావణా! నీకు చెప్పిన ఈ ఉడ్డీశ తంత్రము అయోగ్యులకు ఉపదేశించరాదు. జాగ్రత్తగా పరిరక్షించుము.

శివార్పణమస్తు

## సర్వకార్య సిద్ధమంత్రం

సరస సావర్ణ సింధురసీమంత సువర్ణ సూచకసేచన సైంధవ సోహంభావిత సౌవర్ణే సంతత సంపత్సంతోషం దేహి సః సః స్వాహా ॥

ఈ మంత్రం రోజూ 11సార్లు పఠించి ఇంటినుండి బయలుదేరిన సమస్త కార్యములు సిద్ధించును.

## బ్రహ్మశ్రీ మేడవరపు సంపత్ కుమార్
## అనువాదములు - రచనలు
### త్వరలో

1. వామాచారం
2. వామకేశ్వర తంత్రం
3. కామరత్న తంత్రం
4. తంత్రసంహిత
5. శ్రీశైల తంత్రం
6. బదనికా తంత్రం
7. షట్కర్మ తంత్రం
8. తంత్ర షాడవం
9. భైరవ తంత్రం
10. కాళీ తంత్రం
11. సంఖ్యా తంత్రం
12. గజకర్ణ తంత్రం
13. తంత్ర మార్తాండం
14. తంత్ర కల్పద్రుమం
15. యామళ తంత్రం
16. స్కందతంత్రం
17. పురశ్చరణ తంత్రం
18. మహాకాలతంత్రం
19. హిరణ్య తంత్రం
20. తంత్రమయూరం
21. తంత్రసర్వస్వం
22. ఆకాశభైరవ తంత్రం
23. విశ్వామిత్ర తంత్రం
24. తంత్రసాహితి
25. తంత్ర కౌముది
26. తంత్ర మర్మం
27. తంత్రమంజిష్ఠ
28. తంత్రసారంగం
29. తంత్రసారంగం
30. కర్ణపిశాచినీ తంత్రం
31. తంత్ర సారణి
32. తంత్ర శిఖరిణి
33. తంత్రశాసనం
34. తంత్రకుంజరం

**మేడవరపు సంపత్ కుమార్**
4-399 విశ్వామిత్ర బిల్డింగ్స్
తారకరామనగర్, నరసింహారోడ్
**కాకినాడ - 2**

# రుద్రపీఠమ్

ఇది రుద్రపీఠ యంత్రము. ఇది స్కందపురాణము నందున్నది శివుడు స్వయముగా తానే దీనిని వివరించెను. దీనిని రాగిరేకుపై శాస్త్రోక్తముగా లిఖించి, సంస్కార-ప్రాణప్రతిష్ఠ-జీవకళాదిన్యాసములు చేసి, ఆవరణార్చన చేసినచో, సకల కార్యములు సిద్ధించును. సమస్త సంపదలు కలుగును.

రాగి యంత్రమునకు ప్రాణప్రతిష్ఠ చేసినచో పటము కట్టించరాదు. ఈ యంత్రమును ఇదే రీతిగా అట్టపై అతికించి పలుము కట్టించి, ధ్యాన - స్తోత్రములు చేసిననూ ఇష్టకామ్యములు సిద్ధించును. ఇది అనుభవ సిద్ధం.

అస్యశ్రీ దశాక్షర రుద్ర మహామంత్రస్య, బౌద్ధాయన ఋషిః। పంక్తిచ్ఛందః రుద్రోదేవతా। హం బీజం-నం శక్తిః-మం కీలకం। ఉదాత్తస్వరః। శ్వేతవర్ణం। సర్వసంపత్ సమృద్ధ్యర్థే, సకలాభీష్ట సిద్ధ్యర్థే జపే వినియోగః।

**ధ్యానమ్**

ఆకీర్ణం దివ్యభోగైరమరదితి సుతైరర్చితం శైలకన్యా
దేహార్థంధారయంతం స్ఫటికమణి నిభం వ్యాఘ్ర చర్మోత్తరీయం।
ద్వైపీంకృత్తిం వసానం హిమకిరణకళా శేఖరం నీలకంఠం
హృష్టం వ్యాప్తం కలాభిర్ధృత కపిల జటం భావయే రుద్రమూర్తిమ్ ॥

**మంత్రమ్ ॥ ఓం నమో భగవతే రుద్రాయ**

---




**బ్రహ్మశ్రీ మేడవరపు సంపత్ కుమార్**

**4-399 తారకరామనగర్, జగన్నాథపురం**
**నరసింహరోడ్ కాకినాడ - 2**

& **0884-2341878 □□□□ 98493-54393**

□□□□□□□ 2016@□□□□□.□□□.